# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 17
25–4–1986
శుక్రవారం
14 పేజీలు: రూపాయి

# సెబాష్ విద్యామంత్రీ సెబాష్!

మా ప్రత్యేక విలేఖరి

విద్యామంత్రి శ్రీ ముద్దు కృష్ణమ నాయుడ్ని 'మొద్దు కృష్ణమనాయుడు' అని ప్రతిపక్షాలు నిందించాయికాని, విద్యావ్యాపారులపట్ల ఆయన 'యుద్ధ కృష్ణమనాయుడు'గా తయారైనాడు.

రాష్ట్రంలో ట్యూషన్ల జాడ్యం రెండు దశాబ్దాలక్రితమే ప్రారంభమైంది. అప్పటి నుంచి ఇది పోవాలని నణగని, గొణగని వారులేరు. ఈమధ్యలో వచ్చిపోయిన విద్యామంత్రులెవరికి ఈ గొణుగుడు చెవికెక్కలేదు. అథవా ఎక్కినా, నిషేధపు శాసనంచేసి వారు చేతులు కడుక్కోవడం, అవి కాగితాలమధ్యనే భద్రంగా నిద్రపోవడం మామూలైపోయింది.

మొదట మొదట ఎక్కడో, ఒకరో ఇద్దరో లెక్చరర్లు ఇళ్ళవద్ద పదిమంది పిల్లలకు పాఠాలు చెప్పడనే స్థాయిలో వుండిన ట్యూషన్ల జబ్బు, ఇప్పుడు ప్రభుత్వ కాలేజీలలో జీతాలు తీసుకుంటూ, పోటీ కాలేజీలు పెట్టి లక్షలు గడించేంతగా ముదిరిపోయింది. క్లాసుల్లో చెప్పే పాఠాల ప్రమాణం బట్టికాక, ప్రైవేటు ట్యూషన్లకు పిల్లలనాకర్షించే ప్రావీణ్యతనుబట్టి లెక్చరర్ల 'విలువ' నిర్ణయించే కాలం దాపురించింది. వీరికి కాలేజీ యాజమాన్యాలంటే భయంలేదు; ప్రభుత్వపు జడుపులేదు; అధికారుల అదుపులేదు; ఇంత బరితెగించిన స్థితిలో ముద్దుకృష్ణమనాయుడు తీసుకున్న

## విద్యావ్యాపారులకు వణుకుపుట్టించారు

చర్యలు బీడునేలలో తొలకరి జల్లులుగా కన్పిస్తున్నాయి.

కోచింగ్ సెంటర్లు, ట్యూషన్ల కేంద్రాలను నిరోధించడానికి విద్యామంత్రి పన్నిన వ్యూహం నిజంగా ప్రశంసనీయమైనది. కేవలం ప్రచారంకోసం చేసిన ప్రయత్నం కాదిది. అదే ఉద్దేశమైతే, కాలేజీ యజమానులకు, విద్యాశాఖాధికారులకు తాఖీదులు పంపి, కంటితుడుపుగా దర్యాప్తు చేయించి వుండేవారు. కానీ కలెక్టరు, ఎస్ పి వంటి ఉన్నతాధికారుల సహాయంతో, అత్యంత రహస్యంగా వలపన్ని రాష్ట్రమంతటా ఒకే వేళలో యుద్ధానికి తరలిపోయినట్లు దాడులు జరపడంలోనే, విద్యామంత్రి చిత్తశుద్ధి వ్యక్తమౌతున్నది.

ఈ దాడులు లెక్చరర్లను ఎంత భయవిహ్వలులను చేశాయంటే వారు అధికార్ల దగ్గర కళ్ళనీళ్ళు పెట్టుకొని, ప్రాధేయపడ్డారట. తమకంటూ ఒక స్వంతసంస్థ పెట్టుకొని వ్యాపారం చేసుకుంటుండే లెక్చరర్లకు భయం లేకపోవచ్చుకాని, వారిదగ్గర ఊడిగంచేసే లెక్చరర్లుమాత్రం హడలిపోయారు.

నెల్లూరులోకూడా తొమ్మిది కోచింగ్ సెంటర్లపై రెయిడ్ జరిగింది. రత్నం, నారాయణ, కోరా కోచింగ్ సెంటరు దాడులకు కేంద్రాలు. వీటిలో పార్ట్‌టైం లెక్చరర్లు, అనంతపురం, వెంకటగిరి, విద్యానగర్ వంటి ప్రాంతాలవారుకూడా పనిచేస్తుండినారట. 'అభ్యుదయ వేదిక' యుడు, పట్టాభిరామరెడ్డి వంటివారుకూడా కాలేజీకి లీవ్‌పెట్టి, ప్రైవేటు పాఠాలు చెప్తున్నారంటే, ఇక తక్కినవారివిషయం చెప్పేదేముంది?

అధికారులు చెప్పడంలేదు కాని, ఈ దాడులలో వి. ఆర్., సర్వోదయ కాలేజి లెక్చరర్లు బలంగానేవలలోపడ్డట్టున్నారు. వీరందరి ఫోటోలుతీసుకుని, స్టేట్‌మెంట్లు రికార్డుచేసుకున్నారట. జీతాలు, గీతాలు తీసుకున్న రసీదులుకూడా దొరికాయట. కానీ వివరాలు ఎవరూచెప్పడంలేదు.

అయితే, రెయిడ్‌లవల్ల కోచింగ్ సెంటర్ల వ్యాపారానికేమీ విఘాతం కల్గినట్లు లేదు. మెడికల్, ఇంజనీరింగ్ కోచింగ్‌లకు ఇది తుదిఘడియలైనందువల్ల, విద్యార్థులదగ్గర ఇప్పటికే ఫీజుల రూపంలో లక్షలు గుంజివున్నందువల్ల, వారికి ఇబ్బంది కల్గకుండడం కోసం, సస్పెన్షన్ల భయాన్ని కూడా విస్మరించి లెక్చరర్లు ఇంకా ట్యూషన్లు చెప్తూనే వున్నారు.

టౌన్‌లో, జిల్లాలో, రాష్ట్రంలో వేలాదిమంది విద్యార్థులు, తల్లిదండ్రులు ఈ కోచింగ్ సెంటర్లపైనే ఆధారపడివున్నా, కోట్లరూపాయల డబ్బు ముడుపులు కట్టి వున్నా, లెక్చరర్లపై దాడులు జరిగితే, వారిపట్ల సానుభూతి కల్గలేదు ఎవరిలో! ఒక్కరుకూడా అయ్యోపాపం అన్నవారు లేరు. పైగా విద్యామంత్రిని సెబాష్ అంటున్నారు. దీన్నిబట్టే అర్థంచేసుకోవచ్చు. ఈ విద్యావ్యాపారులపట్ల ప్రజలలో ఎంత ఏవగింపు ఏర్పడివుందో

—కొరవ 7వ పేజీలో

# జమీన్ రైతు

## మార్క్సిస్టుల వైఖరి

తెలుగుదేశం, మార్క్సిస్టు పార్టీల సంబంధాలు అందరికీ తెలుసు. తెలుగుదేశానికి మిగిలిన ఏకైక మిత్రపక్షం ఈనాడు మార్క్సిస్టుపార్టీ ఒక్కటే. అట్లనే ఆంధ్రలో మార్క్సిస్టులకు దొరికిన ఏకైక అండ నేడు తెలుగుదేశం ప్రభుత్వం. పరస్పర లాభదాయకమైన ఈ అవకాశవాద సంబంధాలు ఇంతవరకు పరిమితమైతే ఆక్షేపణలేదు.

కాని పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు ఖమ్మం రైతుమహాసభకు వచ్చిన సందర్భంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు చూస్తే, కాంగ్రెస్‌మీదవున్న గ్రుడ్డి వ్యతిరేకతతో మార్క్సిస్టులు ఇంత దిగజారిపోయారా అనిపిస్తుంది. ఇందిరా కాంగ్రెస్‌తో పోలిస్తే, ఆంధ్ర ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు ప్రగతిశీలుడట; తెలుగుదేశానికి భవిష్యత్తు వుందట; తమపార్టీ రామారావు తోకను వదలిపెట్టదట. జ్యోతిబసు వంటి పెద్దవాణ్ణి మతిపోయినవాడనడం అపచారమే అవుతుంది. కాని, మతివున్నవారెవరూ ఈ అభిప్రాయాలతో ఏకీభవించరు.

సిద్ధాంతాల విషయంలో మార్క్సిస్టులకేకాదు దేశంలోని అన్నిపార్టీలకూ కాంగ్రెస్‌తో సామ్యంలేదు. ఆఖరుకు వ్యక్తిగతంగా కాంగ్రెస్‌నుండి చీలిపోయిన చిల్లరమల్లర పార్టీలుకూడా సిద్ధాంతరీత్యా తాము కాంగ్రెస్‌కు వ్యతిరేకమంటాయి. సిద్ధాంతరీత్యా కాంగ్రెస్‌తో విభేదించే ఈ పార్టీల మధ్యకూడా సిద్ధాంత సామ్యతలేదు. కాని కాంగ్రెస్‌ను ఎదుర్కోడానికి మాత్రం ఈ పార్టీలన్నీ ఏకమవుతాయి. ఈ ఐక్యతకు చిన్నపెద్ద అనిగాని, జాతీయ ప్రాంతీయ అనిగాని, కులమతాలనిగాని పార్టీలమధ్య తారతమ్యం వుండదు. దేశంలో అన్ని ప్రాంతాలకూ అందరు ప్రజలకు ప్రాతినిధ్యం వహించే బలమైనపార్టీ కాంగ్రెస్ ఒక్కటే. బలమైన ఈ పార్టీని తమందరి సమష్టి బలంతో దెబ్బతీస్తే, తర్వాత రాజ్యం తమదేనని ప్రతిపార్టీ భ్రమ. ఉభయ కమ్యూనిస్టుపార్టీలు, బి. జె. పి. ల మధ్య ఇందులో పోటీ!

ఈ భ్రమతోనే ఆంధ్రలో అన్నిపార్టీలు తెలుగుదేశాన్ని బలపరచాయి. సంవత్సరం తిరగక ముందే ఈ భ్రమనుండి ఒక్క మార్క్సిస్టుపార్టీతప్ప తక్కిన అన్నిపార్టీలు బయటపడ్డాయి. ఈనాడు ఈ పార్టీలన్నీ తెలుగుదేశాన్ని కాంగ్రెస్‌కంటే ఎక్కువగా విమర్శిస్తున్నాయి, మార్క్సిస్టులూ వాస్తవం తెలియకకాదు; ఒక రాజకీయ ఎత్తుగడగానే తెలుగుదేశానికి తమ సహకారాన్ని కొనసాగిస్తున్నారు. కొనసాగించుకోవచ్చు; కాని ప్రతిపక్షులకు ప్రతినిధి అనదగిన రామారావును ప్రగతిశీలునిక్రింద పేర్కొనడం; కేవలం రామారావు సినిమామోజుపై ఆధారపడిన తెలుగుదేశానికి భవిష్యత్తున్నదనడం రాజకీయ పతనమే అవుతుంది. ఇటువంటి అభిప్రాయాలు ప్రకటించడంద్వారా జ్యోతిబసు, ఆయన ప్రాతినిధ్యం వహించే మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ తమ వ్యక్తిత్వాన్ని కోల్పోవడమేకాదు, తమ అవకాశవాదాన్ని నగ్నంగా ప్రదర్శించుకోవడమే అవుతుంది!

---

నెల్లూరు పురపాలకసంఘ కార్యాలయము

ఆర్. సి. నం. 3105/86-ఎఫ్ 2 తే: 22-4-1986

### నెల్లూరు మునిసిపాలిటీ ఎరువుల వేలంనోటీసు

కృష్ణాపట్నం రోడ్డు మరియు వరకూరు రోడ్డు కంపోస్టు డిపోలలో 1983-84, 1984-85 సంవత్సరములలో వేలము వేయబడక మిగిలి వున్న ఎరువుల గుట్టలు మరియు 1986 సంవత్సరంలో తయారైన ఎరువుల గుట్టలను తేది 16-5-1986 మరియు 19-5-1986 లలో వరుసగా పై డిపోల ఆవరణములో ఉదయం 10 గంటలకు బహిరంగముగా వేలము వేయబడును. సదరు వేలము పాటలలో పాల్గొనదలచినవారు లాటు ఒక్కింటికి రు. 100/-లు ధరావత్తు వేలము జరిగే ముందు చెల్లించి వేలములో పాల్గొనవచ్చును. మిగతా వివరములు మునిసిపల్ ఆఫీసు పని వేళలలో తెలుసుకొనవచ్చును.

బి. ఎన్. నరసింహం

కమీషనరు మరియు స్పెషల్ ఆఫీసరు

---

## అరవై ఏళ్ళ క్రితం జమీన్ రైతు

24-4-1936

12 పేజీలు-వెలలేదు - సంవత్సరచందామాత్రం రూ 3-00లు.

సినిమా ప్రకటనలు

మొదటి, ఆఖరు పేజీలు ఫుల్ పేజీ సినిమా ప్రకటనలు.

మొదటిపేజీలో "శ్రీరామాఫిలింస్ వారి బ్రహ్మాండమైన టాకీ" సతీతులసి-కవి: కవికోకిల దువ్వూరు రామరెడ్డి: డైరెక్టరు చిత్రపు నరసింహరావు; నటీనటులు: సంగీత విద్వాన్ బి. ఎస్. రాజయ్యంగార్, వేమూరు గగ్గయ్య, మాధవపెద్ది వెంకటరామయ్య, పులిపాటి వెంకటేశ్వర్లు, ఘంటసాల రాధాకృష్ణయ్య, కాశీ వెంచు.... శ్రీరంజని, రామతిలకం, లక్ష్మీరాజ్యం.

ఆఖరు పేజీలో శ్రీ లక్ష్మీ ఫిలింస్ వారి ద్రౌపదీ మాన సంరక్షణము- 9-5-36 శనివారం మొదలు నెల్లూరు క్రొత్తహాలులో - మిస్ (సురభి) కమల ద్రౌపది.

నెల్లూరు ముచ్చట్లు

పబ్లిక్ ప్రాసిక్యూటర్ పిచ్చు అక్బరుదాకా కాలంవుంది. కాని ఖాన్ బ॥ గారి (బహుశా ఖాన్ బహదూర్ యీ హ్యాలీసాహెబ్‌గా వుండాలి-సం.) కిడ్డి పాయింట్‌మెంటు రూమరుతో అప్పుడే అందరు ట్రై చేస్తున్నారు. ఇందుకు ప్రయత్నికులు నలుగురు. మా బెజవాడారెడ్డిగారు, వేదాంతాచారిగారు, వున్నయ్యగారు, విశ్వనాథరావుగారు, జిల్లాజడ్జి, కలెక్టరుగార్ల సిఫారసులతోవుంది అదృష్టం. రెడ్డిగారికి పైన పలుకుబడివున్నా స్థానికాధికారుల రెకమెండేషన్ దుర్లభం.

### 50 ఏళ్ల క్రితం ఈవారం

వేదాంతాచారిగారి పలుకుబడి సంస్థానపు పలుకుబడితో మేళవించినా షరెక్కదంటారు, ఇక పున్నయ్య విశ్వనాథరావు గార్ల మధ్యలో ఉంటుందేమో, అధికార్లకు ఇరువురు భక్తులే. ఒకరు క్రైస్తవులు, ఒకరు బ్రాహ్మలు. బ్రాహ్మణ నిషేధానికి రెడ్‌క్రాస్ సొసైటీగారి బిరుదాలుకూడా అడ్డుపడుతవి. కాబట్టి విశ్వనాథరావుగారికి ప్రథమ ఛాన్సుంటుందేమో,

• • •

మా డాక్టర్ సలాంసాహెబ్‌గారు కూడా పై నలుగురితోబాటు నాగూరు మీరాసాహెబ్‌గారికి చక్కెర చదివిస్తున్నారు ఖాన్ బహదూర్‌గారి జడ్జీపని కోసం. ఒక్కొక్కపుడు చెడుపుకోరాలసిన విరోధులకుకూడా క్షేమం కోరవలసివస్తుంది తమ లాభంకోసం.

• • •

ఇక మున్సిపాల్టీ: సాహెబ్‌గారు హైకెళ్ళాలా, చేరమెడగిరి నాల్గురోజులు దొమ్ములాయుతుంది లేక దుమ్ములో. రామిరెడ్డిగారా వియోగ దుఃఖములో ఉన్నారు. అపేక్షిస్తారో లేదో? రేబాల సోదరునికి మాత్రం కొంత పురెక్కింతారు స్నేహితులనే స్వలాభపరులు. విద్య వయస్సు అనుభవం మూడు ఏకదశలోనే ఉన్న రెడ్డిగారు కొంతకాలం ఆగితే యేమి మునిగిపోయింది? విద్య, అనుభవం, సమర్థులైన మరొకరిని జాతీయాభిప్రాయాలుండేవార్నే ఎన్నుకుంటే బెటర్.

లోకాభి రామాయణం

అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో యీయేడు ప్రవేశంలేకుండా చేయడం ఆంధ్ర పౌరుషానికి ముక్కు చెవులు కోసినట్లైంది.

• • •

సి. ఆర్. రెడ్డిగారు మే నెలలో ఆంధ్ర వైస్‌ఛాన్సలర్‌గా పోతారట గాని జిల్లాబోర్డు, శాసనసభ్యత్వములు వదలుకోవాలనే నియమంలేదంటారు. కాబట్టి ప్రస్తుతం జిల్లాబోర్డుకు రాజీనామా యివ్వరంటారు. అథవా రాజీనామా ఇచ్చినా రఘునాథరెడ్డిగారికి, రామకృష్ణారెడ్డిగారికి జంఝా ముష్టి యుద్ధం తప్పదంటారు.

---

# ఒకరిమేలుకోసం కోట్లదుబారా!

రాజకీయంకూడా వ్యాపారమే కాబట్టి, ప్రచారం దానికి మూలవస్తువు. చేసినపని కొంచమైనా, కొండంత ప్రచారం చేసుకోగలిగితేనే రాజకీయప్రయోజనం సిద్ధిస్తుంది. మన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుకు ఈ సూత్రం బాగా వంటబట్టినట్లుంది. ఏ రోజు ఏ పేపరైనా తెరిచి చూడండి. ఎన్. టి ఆర్. బొమ్మలే!

ముకుళితహస్తాలతో నిలువెత్తుఫోటోలు, మునిముని నవ్వులతో నడుంవరకు ఫోటోలు, చిత్రవిచిత్ర భంగిమలతో చిన్న చిన్నఫోటోలు. నామాలుదిద్ది కొన్ని, దిద్దక కొన్ని...., స్కూటర్ల రేట్లుతగ్గినా ఆయన ఫోటోనే. అడవాళ్ళ మరుగుదొడ్లు యినా ప్రక్కన ఆయనుండాల్సిందే; శెల్ల పెంపకమైనా, బస్టాండుప్రారంభమైనా, మరొకటి మరొకటి జరిగినా అన్నగారి బొమ్మలే!

ఏమిటీవేలంవెర్రి? ప్రతి ప్రభుత్వ కార్యక్రమాన్ని పార్టీ మేలుకోసం ప్రచారం చేసుకోవడం పెద్దతప్పయితే, చిన్న పనులకుకూడా పెద్ద పెద్ద ప్రకటనలతో పేజీలు నింపివేయడం ఇంకా ఘోరం. లక్షల, కోట్లరూపాయల ప్రజాధనం ఇట్లా ఒక వ్యక్తి ప్రయోజనంకోసం దుబారా కావడం అన్యాయంకాదా? ప్రజాస్వామ్యంలో నీతులు, నియమాల గురించి అదర్శాలు వల్లెవేసే ఎన్. టి. ఆర్. చేయవలసినపనేనా ఇది?

-కె. లక్ష్మీకాంతశర్మ

నాగమాంబాపురం

### కనిగిరి చెరువునీళ్ళు

కనిగిరి చెరువుక్రింద రెండుపకారుకు, అధికారికంగా [illegible] ప్రాంతం వరకు నీళ్ళిస్తున్నారు; అనధికారికంగా రేపాల, నాగమాంబాపురం లట్లాయపాలెం, [illegible] పాలెం, [illegible] ఆదివారం [illegible] వరకు నీళ్ళిస్తామని చెప్పారు. నేరం కుదిరి, బయానాగా కొంత సొమ్ము ఇవ్వడంకూడా జరిగింది. అయితే రైతులు

### జనవాణి

సకాలంలో చెప్పిన మొత్తం తెచ్చివ్వలేదని ఇప్పుడు కాలువలన్నీ కట్టేశారు. వేసిన నాట్లలో, కలుపు పెరిగిపోతూంది; వెయ్యాల్సిన నారు ముదిరిపోతూంది రైతులు లబోదిబోమంటున్నారు.

అయ్యా, ఇంజనీర్లూ- రైతులు ఆడిన మాట తప్పరు, అవదలోవుండి ఆలస్యం చేసివుంటారు. కనికరించి, నీళ్లొదలండి.

ఒక అభాగ్యరైతు

---



---

# "జిల్లాపార్టీనిక్యాన్సర్‌పట్టుకుంది- ఆపరేషన్ చేసేస్తాను జాగ్రత్త"!

ముఖ్యమంత్రికి ముఖ్యమంత్రి, తెలుగు దేశాధిపతికి అధిపతి శ్రీ చంద్ర బాబునాయుడు తొలిసారిగా నెల్లూరు విచ్చేస్తే, ఎందువల్లో జిల్లా నాయకత్వం ఆయనకు నీరాజనం ఎత్తడానికి వెనుక ముందు లాడింది, రోడ్లలో పోలీసుల కటాటోపం, అతిథి గృహాల్లో అధికారుల ఆర్భాటం తప్ప, పార్టీపరంగా నేతలకు నేతయిన బాబుగారిని 'థ్రిల్' చేయడంలో జిల్లా నాయకులు విఫలమయ్యారా అనిపించింది.

సాధారణంగా పార్టీ పెద్దలు పర్యటనకు వస్తే, తోనంతా స్వాగతాడంబరాలతో తళుకులీనేట్లు చేయడం మనకు సాంప్రదాయం. తెలుగుదేశం అధికారంలోకి వచ్చిన తర్వాతకూడా. ముఖ్యమంత్రి వచ్చినప్పుడల్లా ఎంతెంత అట్టహాసం జరిగేదీ మనకు తెలియనిదికాదు. బాబు గారు దిగుతుంటే, టౌనంతా పసుపు మయమైపోతుందని ఆశపడితే, సభ జరిగిన టౌన్‌హాలు ఆవరణంకూడా వెల్తిగానే కన్పించింది.

స్వాగత ఏర్పాట్లేకాదు, జిల్లా పార్టీ ఫణితీరుకూడా బాబుగారి మనసుకు నచ్చినట్టులేదు. వచ్చినప్పటినుంచి, తిరిగి పోయేదాకా చిర్రుబుర్రులాడుతూనేవున్నారాయన. ఆ రుసరుసలు. చిటపటలు చూసి, తారెత్తిపోయి, కార్యకర్తలకు క్షణం కాలునిలువక పరుగులుపెట్టాల్సి వచ్చింది.

22 తేదీ పొద్దున ప్రభాతసేవే నాయకులకు పరాభవంతో ప్రారంభమైంది. ఏడుగంటలకల్లా మంత్రిగారితోసహా జిల్లా అంతటినుంచి పార్టీ చిన్నపెద్దలంతా ఆర్ అండ్ బి అతిథిగృహాలదగ్గర మూగిపోయారు. పచ్చ జొక్కాలతో ఆవరణం

> **తెలుగు దేశం నాయకులతో చంద్రబాబు చిటపటలు ధూంధాంలు**

కిటకిటలాడిపోయింది. బాబుగారుమాత్రం గాఢనిద్రావశులై, తొమ్మిదిగంటలకుకాని ధర్మదర్శనం చేయలేకపోయారు. అప్పటి వరకు మంత్రిగారుకూడా గోళ్ళు గిల్లుకుంటూ, కాలుగాలినపిల్లిలా పచార్లు చేస్తూ, క్రింద పడిగాపులు కాశారు.

తొలుత, రాజరాజేశ్వరి ఆలయ సందర్శన- వివేకానందస్వాములవారి ఏర్పాట్లు, ఆఖరినిముషం వరకు శ్రీనివాసులురెడ్డికి ఈ కార్యక్రమం సమాచారం లేదట; అప్పుడుకూడా పిలుపు బాబుగారి నుంచి వచ్చింది. తప్పించుకోలేక 'మీరెక్కడికి రమ్మంటే అక్కడకొస్తాను. ఐయామ్ ఆట్ యువర్ డిస్పోజల్' అని వినయాతివినయంగా పలికి, కారెక్కారు.

తర్వాత రమేష్‌రెడ్డి సైకిల్‌యాత్ర. అత్తితోటవారి అగ్రహారంలో డాక్టర్ ప్రభాకరనాయుడుగారి ఇంటిని, రాత్రికిరాత్రి పార్టీ ఆఫీసుగామార్చి, మండల అధ్యక్షుల సమావేశం ఏర్పాటుచేశారు. ఉదయం పదిగంటలనుంచి, సాయంత్రం ఆరుగంటలవరకు చర్చలు, సమాలోచనలు జరిపారు. మండలాధ్యక్షులు, ఎమ్మెల్యేలాదులకే ప్రవేశం. ఏ పదవీ తోకలులేని మాదాసు గంగాధరం, వై. టి. నాయుడు, వివేకానందరెడ్డి, ఎం. వి. నారాయణ వంటివారి నందరినీ నిర్దాక్షిణ్యంగా మెట్లుకూడా ఎక్కనివ్వకుండా, వెనక్కు పంపేశారు.

చెట్లపెంపకం, చౌకడిపోలు, గ్రామీణ క్రాంతిపథకం, పక్కాఇళ్ళు తదితర అభివృద్ధి కార్యక్రమాలన్నింటిపై బాబు, ప్రశ్నలవర్షం కురిపించారట, ఒకరిద్దరు తప్ప, తక్కినవారెవరిదగ్గరా సమాధానాలు లేవట. మీ మండలాలలో ఏమిజరుగుతుందో తెలుసుకోలేకపోతే, రేపు మండలాల ఎన్నికల్లో ఎట్లా పోటీచేస్తారు, పనిచేస్తేనే మీకు ఎన్నికల్లో అవకాశం, లేకుంటే ప్రక్కకునెట్టేస్తాం అని మెత్తగా చీవాట్లుపెట్టాడట.

—కొరవ 8వ పేజీలో

# పోలీసు ఇంత దుడుకైపోతున్నదేమిటి?

ర్యాడికల్ యువజన సంఘాలు గోడలమీదే రాసే 'పోలీసు రాజ్యం, తుపాకిరాజ్యం' నిజంగానే సృష్టించడానికి కంకణం కట్టు కున్నట్టున్నారు జిల్లాలో పోలీసులు. మొన్న 9 తేది కావలిలో జరిగిన దుర్ఘటన ఇటువంటి పోలీసు దురహంకారం, దుర్మార్గం తప్ప వేరుకాదు.

కొండాపురం వెళ్లే ఆర్ టి సి బస్టాండు, పెదపవని బస్టాండులో నిలబడి వుండిందట. బయల్దేరటోయేముందు టౌన్ సి ఐ శ్రీ నూకరాజు వచ్చి, బస్సు రోడ్డుకు అడ్డంగా పెట్టాడని డ్రైవరును తిట్టి, క్రిందకు లాగి, కొట్టి, స్టేషన్‌కు ఈడ్చుకుని పోయాడట. చుట్టుప్రక్కలవారెంత చెప్పినా విన్పించుకోలేదట.

కొద్దిసేపు తర్వాత, రోడ్డుపై వేరే బస్సుకోసం మూగివుండిన ప్రయాణీకులపై సి ఐ. ఎస్ ఐ లు కలిసి లాఠీలు ఝుళిపించారట, ఆర్ టి సి సిబ్బంది వేసుకొని వుండిన గుడారం పీకిపడేశారట. జులుం మరీ శృతిమించడంతో అరాత్రి నుండి ఆర్ టి సి సిబ్బంది సమ్మెకు దిగారు. రెండురోజులు డిపోనుంచి ఒక్క బస్సుకూడా కదలలేదు. ఎస్పి, ఆర్‌టిసి రీజనల్ మేనేజర్ చేసిన రాజీలు విఫలమైనాయి. చివరకు, కలెక్టర్ జోక్యంతో సమ్మె విరమించారు.

పోలీసులు వీధి రౌడీలకంటే హీనంగా దుడుకుపడుతుంటే, ఎట్లా క్షమిస్తున్నారండీ, ఎస్ పి గారూ?

## కావలి వార్తలు

సిండికేట్ బ్యాంకు సమీపంలో సత్యసాయి సేవాసమితి ఒక బస్‌షెల్టర్ నిర్మించింది. ఆర్‌టిసి పర్సనల్ ఆఫీసర్ శ్రీ అబ్దుల్ కరీం 10 తేది దీన్ని ప్రారంభించారు. శ్రీ బలీంద్ర, శ్రీ వరదరాజం దీని నిర్మాణానికైన 10 వేలు విరాళంగా ఇచ్చారట.

• • •

రిటైర్డ్ తెలుగు పండితుడు శ్రీ పసాల రామమూర్తి గ్రంథం- 'ఆంధ్ర సౌందర్య లహరి' 10 తేది శ్రీ రావులూరి సుదర్శనరావు ఆవిష్కరించారు. శ్రీ జి. శ్రీరామశర్మ అధ్యక్షించారు. బ్రాహ్మణ

> **జిల్లావార్తలు**

సమాజం తరఫున శ్రీ నందనవనం సత్యనారాయణ కవిని సత్కరించారు.

• • •

కల్పన సమాఖ్య ఇటీవల కలికి మల్లారెడ్డి భవన్‌లో రాష్ట్రస్థాయి కార్టూన్ల పోటీ నిర్వహించింది. డాక్టర్ ఎస్. జయదేవ్ రిబ్బను కత్తిరించారు. చిత్రకారుడు శ్రీ ఉత్తమ్‌కుమార తన రంగుల చిత్రాలు కూడా ప్రదర్శించారు. తర్వాత కార్టూనిస్టు సామాజిక బాధ్యత అనే అంశంపై సదస్సు జరిగింది. జయదేవ్, ఉత్తమ్, సత్యదేవ్, రామకృష్ణ, బలిప్రసాద్ తదితరులు మాట్లాడారు.

## మర్రిపాడు దౌర్జన్యం

ఉదయగిరితాలూకా మర్రిపాడు పినా

-కొరవ 8వ పేజీలో

శ్రీ లక్ష్మీ నృసింహాయనమః

## శ్రీ వేదగిరి లక్ష్మీనరసింహస్వామివారి దేవస్థానం

నరసింహులకొండ - నెల్లూరుతాలూకా & జిల్లా

బ్రహ్మోత్సవములలో 21-5-86 నుండి 24-5-86 వరకు (అనగా 4 రోజులమాత్రం) తలనీలాలు పోగుచేసుకొను హక్కును 2-5-86 తేదీ ఉదయం 11 గంటలకు సదరు దేవస్థానముపద్ద దేవాదాయ ధర్మాదాయశాఖ నెల్లూరు ఇన్స్పెక్టరువారి సమక్షమున బహిరంగ వేలము జరుపబడును. వేలముపాటకు ముందు రు. 200/- లు డిపాజిట్టు చెల్లించి పాటలో పాల్గొనవలెను. పాటతెగిన వెంటనే డిపాజిట్టు పోను మిగిలిన పైకము చెల్లించవలెను. అట్లు చెల్లించని యెడల సదరు డిపాజిట్టు పైకము సర్ఫీటు చేయబడును. మిగిలిన పాట షరతులు పాటకుముందు తెలియచేయబడును.

నరసింహులకొండ
21-4-86

పద్దినేని సాయిబాబా
కార్యనిర్వహణాధికారి



## నెల్లూరు నలుచెరగుల్లో
### విహార్మకుడు

### మంత్రులు

జిల్లాకు ఈవారం ముగ్గురుమంత్రులు వస్తున్నారు.

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి కార్యక్రమం అధికారికంగా 23 తేదితోనే పూర్తయింది. కాని ఆయన 24, 25 తేదులలోకూడా జిల్లాలో వున్నారు.

హోం మంత్రి శ్రీ వసంత నాగేశ్వరరావు 25 తేది వెంకటగిరి నియోజకవర్గంలో పర్యటిస్తున్నారు. పెట్లూరు మొగ్గగుంట, నెల్లూరు, వెంకటగిరి, డక్కిలిలో కార్యక్రమాలున్నాయి. ఆ రాత్రే తిరిగివెళ్లారు.

సాంఘిక సంక్షేమ మంత్రిణి శ్రీమతి ప్రతిభాభారతి 26 తేది మధ్యాహ్నం రెండుగంటలకు మద్రాసునుంచి కారులో వస్తారు. 27 తేది ఉదయం సాంఘిక సంక్షేమ కార్యక్రమాల సమీక్ష. సాయంత్రం బెజవాడ ఈశ్వరమ్మ సన్మానసభ. 28 తేది మధ్యాహ్నం 1 గంటకు రైల్లో శ్రీకాకుళం వెళ్లారు.

### రమేష్ రాజీనామా

నెల్లూరు టౌన్ తెలుగుదేశం అధ్యక్ష పదవికి రమేష్‌రెడ్డి రాజీనామా చేశాడు. జోడుపదవులు వుండకూడదని అన్నగారు ఆదేశించడంతో, తనకు యువశక్తిఛైర్మన్‌గిరి లభించింది కాబట్టి, ఈ రాజీనామా పెట్టాడట.

### పాల సంఘం

సంగం డెయిరీవలె, నెల్లూరు జిల్లాకు కూడా పాల ఉత్పత్తిదారుల సహకార సంస్థ ఏర్పడింది, 'ఆపరేషన్ ఫ్లడ్-2'లో భాగంగా జిల్లాలో పాలఉత్పత్తిని పెంచే బాధ్యత ఈ సంస్థ స్వీకరిస్తుందట.

సంస్థ పాలకవర్గానికి 23 తేది ఎన్నికలు జరిగాయి. మొదటినుంచి డెయిరీని కనిపెట్టుకొని వుండిన అములూరు రైతు, శ్రీ ఎం. గోపాలకృష్ణ చౌదరి సంస్థకు ఛైర్మన్‌గా ఎన్నికైనారు. జిల్లాలోని 186 సహకార పాల ఉత్పత్తి సంఘాలు ఈ ఎన్నికల్లో ఓట్లు చౌదరికి 123, పోటీగా నిలబడిన పెనుబల్లికైన శ్రీ చెన్నారెడ్డి రామకృష్ణారెడ్డికి 62 ఓట్లు వచ్చాయి.

### బంగారు బిస్కెట్లు

దొంగబంగారు బిస్కెట్ల స్మగ్లింగ్‌లో నెల్లూరు దినదినాభివృద్ధి చెందుతూంది. ఎంతవరకు నిజమో తెలియదుగాని ప్రతిరోజూ టౌన్‌లోకి దిగుమతౌతున్నాయట.

మొన్న 21 తేది రాత్రికూడా, రైల్వే స్టేషన్ నుంచి చిన్నబజారుకు వెళ్తున్న ఇద్దరు యువకులను నెల్లూరు సెంట్రల్ ఎక్సైజ్ అధికారులు ఆపి, సోదాచేసి చూస్తే 7 లక్షల రూపాయల విలువైన బిస్కెట్లు దొరికాయట. నలుగురు ఇన్స్పెక్టర్లు, ఒక సిపాయి రాత్రంతా స్టేషన్లో జాగారంచేసినా, ఏమీదొరకలేదట. తిరిగిపోతూ, సంతపేటవద్ద కాపుకాసివుంటే, ఈ రిక్షా వస్తుండిందట. ఆపి, అందులోని వారిని ప్రక్కనేవున్న పార్కులోకి తీసుకొనిపోయి సోదాచేస్తే, సరకు బయటపడిందట. అయితే, ఆ యువకులిద్దరూ పెనుగులాడి, సిబ్బందిని తొలగదోసుకుని పరారైనారట. వస్తువులుమాత్రం అక్కడే విసిరేసిపోయారు.

ఈ యువకులలో ఒకరు చిన్నబజారులో ప్రసిద్ధుడైన ఒక కామాటివీధి కుటుంబీకుడని తెలుస్తూంది.

స్మగ్లింగ్ నిరోధంలో నెల్లూరు సెంట్రల్ ఎక్సైజ్ సిబ్బంది, అధికారులూ సమర్థవంతంగా పనిచేస్తున్నారు. వారికి ప్రజల సహకారం దొరికితే మరింత బాగుంటుందేమో!

### ముక్తాపురం హత్య

సంగం మండలానికి చెందిన ముక్తాపురంలో 23 తేది రాత్రి ఒక దారుణ హత్య జరిగింది. శ్రీమంతుడైన నరసయ్య (40) అనే రైతును, అదేగ్రామానికి చెందిన జక్కా రామసుబ్రహ్మణ్యం, మరో ఇద్దరుకలిసి గొడ్డళ్లు, కత్తులతో నరికి చంపారట. ఈదాడిలో నరసయ్య తమ్ముడి, భార్య, కూతుళ్లకు కూడా కత్తిపోట్లు తగిలాయట. అయితే వారెవరికి ప్రాణప్రమాదమున్నట్టులేదు. గ్రామకక్షలే ఈ దారుణానికి కారణమట.

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు (9672) క్రొత్తవి (పుట్టి) | 1400-00 |
| .. పాతవి | 1800-00 |
| బి. ఆర్. 20 | 1350-00 |
| ఉలవలు 100 కి. | 215-00 |
| పెసలు కూడు | 220-00 |
| పిల్లిపెసలు .. | 165-00 |
| మినుములు .. | 230-00 |

### నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 13.90 అ. |
| కనిగిరి రిజర్వాయరు | 14.00 అ. |
| సర్వేపల్లి | 6.70 అ. |

# జిల్లావార్తలు

(5వ పేజీ తరువాయి)

టిపి గ్రామీణ బ్యాంకు ఫీల్డ్ ఆఫీసర్ శ్రీ ఎస్. శంకరరావుపైన 14 తేది గ్రామస్తులు కొందరు దాడిచేసి, దౌర్జన్యం చేశారట, తాము చెప్పినవారికి అప్పులివ్వ లేదనే కోపంలో ఈ దుడుకు తనానికి పాల్పడ్డారట. తర్వాత పోలీసులు, ఈ కేసులో 5 మందిని అరెస్టుచేశారు.

ఈ దౌర్జన్యానికి కారణం కేవలం బ్యాంకు అప్పులేనా, లేక స్థానిక రాజకీయాలేవైనా వున్నాయా అన్న దొక అనుమానం. పోలీసు దర్యాప్తులో తేలాలి ఆవిషయం.

## చెన్నూరు నాటికలపోటీలు

గూడూరు తాలూకా చెన్నూరులోని లలితకళామందిర్ హాలులో నాటికల పోటీలు నిర్వహిస్తుంది. బహుమతులు మొత్తాలు పెద్దవిగావున్నాయి. ఆసక్తి వున్నవారు వివరాలకు కార్యదర్శికి వ్రాయండి.



## గూడూరు రేప్-శిక్ష

తూర్పు పూండ్ల గ్రామంలో 84 ఏప్రెల్ 17 తేది ఒక ఎనిమిదేళ్ల బాలికను రేప్‌చేయడానికి ప్రయత్నించాడన్న నేరారోపణపై, అదే గ్రామానికిచెందిన రామనేని వెంకటేశ్వర్లు (21) అనేయువకుడికి గూడూరు అసిస్టెంట్ సెషన్స్‌జడ్జి శ్రీ రాలవ సుబ్రహ్మణ్యం ఆరునెలల కఠిన శిక్ష విధించారు.

ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా శ్రీ ఎరగుడిపాటి రామారావు, డిఫెన్సు తరపున శ్రీ పి. హరనాథప్రసాద్ కట్టా సుబ్బారెడ్డి వాదించారు.

## గూడూరు కాలేజికి విరాళం ముమ్మరం

గూడూరులో దువ్వూరు రమణమ్మ మహిళాకళాశాలకు నూతనంగాకట్ట తల పెట్టిన భవన నిర్మాణానికి విరాళాలు వరదలుగా వచ్చిపడుతున్నాయట. ఎప్పుడూ ప్రజాసేవకు దూరంగావుండే పి. ఆర్. క్లబ్‌కూడా ఒక గది కట్టిస్తున్నారట.

నిర్మాణం పనికూడా ముమ్మరంగా జరుగుతూవది. ప్రహరీగోడ పని మొదలైంది. గుంటల్లో నిల్వవుండిన నీటినంతా తోడేశారు, జి. ప. ఛైర్మన్ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటున్నాడట.

## తడ విద్యార్థిని గోడు

తడ జి ప హైస్కూలులో 9 తరగతి చదువుతున్న షేక్ అమీరున్నిసా అనే విద్యార్థినికి సంబంధించిన రికార్డులు గూడూరు జి ప బాలికల హైస్కూలులో జరుక్కుని పోయాయట. ఆమె ఇదివరకు అక్కడ చదువుతూ, తండ్రికి బదిలీ కావడంతో, తడకు మారిందట. అయితే పాత రికార్డులు రానిదే, 10 తరగతికి ప్రమోషన్ ఇవ్వననంటాడట, తడ హెడ్మాష్టరు: గూడూరు స్కూలు సిబ్బంది అవి పంపరట. మధ్యలో నలిగిపోతున్నానని గోడుగోడు మంటూంది, ఆ విద్యార్థిని. జి ప ఛైర్మన్ గారైనా ఆమెకు న్యాయం చేయకూడదా?

## వింజమూరు డాక్టర్

వింజమూరుకు కొత్తగావచ్చిన డాక్టరు రోగులను సరిగా చూడడంలేదని, తిడుతున్నాడని, సీరియస్‌కేసువస్తే, భయపడి సెలవుపెడుతున్నాడని గ్రామస్తులు కొందరు చెప్తున్నారు, అనుభవశూన్యులను ఇంతపెద్దగ్రామాల్లో నియమిస్తే, వంటరిగా బాధ్యత ఎట్లా నిర్వర్తించగలరు చెప్పండి? ఆ డాక్టరును మార్చి, వారికి మంచివైద్యుడ్ని వేయండి!

## వెంకటగిరి ప్రమాదం

వెంకటగిరి సమీపంలోని కందులవారి పల్లెలో ఒక ఆయిల్ ట్యాంకర్ తిరుమలశెట్టి నరసింహులు అనే ఏడేళ్ల బాలుడ్ని గుద్దిందట; పాపమా పిల్లవాడు అక్కడికక్కడే చనిపోయాడట, టౌన్ సి. ఐ. శ్రీ ఆదెప్ప ట్యాంకర్ డ్రైవరును అరెస్టు చేశారు.

## వెంకటగిరి దేశం ఆఫీసు

వెంకటగిరి మండల తెలుగుదేశం ఆఫీసు భవనానికి 23 తేది ఉదయం రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి రిబ్బను కత్తిరించారు. మండల అధ్యక్షురాలు కుమారి ఎం వి ఎస్ గిరిజా కుమారి అధ్యక్షించారు; జి ప ఛైర్మన్ శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి జెండా ఎగురవేశారు. ఎమ్మెల్యేలు శ్రీ భవార సాయికృష్ణ యాచేంద్ర, ఆనం రామనారాయణ రెడ్డి తదితరులు మాట్లాడారు. ★

# ఉత్తరక్రియలు



పూజ్యులు

## రావి సుబ్బరామానాయుడు

ఈదూరు

13-4-86 తేది ఆదివారం స్వర్గస్తులైనారు.

ఆయన పవిత్రాత్మకు శాంతిని కలుగజేయాలని

భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## ఉత్తరక్రియలు

3-5-86 తేది శనివారం ఈదూరు గ్రామంలో

స్వగృహమున జరుగును, కాన తెలియజేయడమైనది.

రావి రమణయ్యనాయుడు, రావి శ్రీనివాసులునాయుడు,

జనార్దన చౌదరి, సుధాకర చౌదరి - కుమారులు

వల్లమూడి రమణలత - కుమార్తె.

రావి వీరయ్యనాయుడు, లింగయ్యనాయుడు, జయరామయ్యనాయుడు

దశరథరామానాయుడు, గోపాలకృష్ణ చౌదరి - సోదరులు



## First Death Anniversary

on 28th April 1986



In Fond Memory of
our Beloved

**Dr. N. Krishna Rao**

who left us on 9-5-85.
" We Humbly Bow To
You in Reverence "
May your Soul Rest In
Eternal Peace.
WIFE & CHILDREN.

# 'జిల్లాకి ఎవరూచేయని సేవచేశా'

(౧ వ పేజీ తరువాయి)

నెలువూరు మండలాధ్యక్షులు తమ మాట రెవిన్యూ ఇన్స్పెక్టర్లు కూడా వినడం లేదని గోలపెట్టారట. ఆ ఫిర్యాదుల వన్నిటినీ వ్రాతమూలకంగా తీసుకుని, కట్టకట్టుగాని తనవెంట తీసుకొనిపోయారు బాబుగారు.

ఉదయగిరి, ఆత్మకూరు తాలూకాల్లో పార్టీ శక్తి సన్నగిల్లిపోయిందని, కావలిలో బ్రష్టుపట్టిపోతూందని చింతించారట. తమకు ఎవరైనా ఎమ్మెల్యేల తోడ్పాటు వుంటే సరిచేస్తాం అని మొదటి రెండు తాలూకాలవారు హామీ ఇచ్చారట.

సాయంత్రానికి సమావేశం వేడెక్కింది. మంత్రివర్యులు, తన పై పార్టీసభ్యులు అనవసరంగా అభినిందలు వేస్తున్నారని, రాపూరు వెంకయ్యగౌడ్ వచ్చిపోవడం కూడా తప్పుగాచిత్రిస్తున్నారని, మంత్రిగా వుంటూ తనదగ్గరకు మనుషులు రావడం కూడా కూడదనడం అన్యాయమని ఆవేదనగా పల్కారట.

దానితో తొంకల రామానాయుడు గయ్‌మని లేచి, పార్టీకి ద్రోహంచేసిన కొమ్మి లక్ష్మయ్యనాయుడిని పైనేసుకుని వస్తున్నావని నిందించాడట. లక్ష్మయ్య నాయుడు, పార్లమెంట్ ఎన్నికలలో తెలుగుదేశానికే చేశాడని, జైలు నుంచి ఓ రేపల్లిని దించడంలో, బాలచెన్నయ్యను ఎక్కించడంలో తోడ్పడ్డాడని బిజెపికి పనిచేయకుంటే పెద్దతప్పుకాదని సర్ది చెప్పారట.

ఇంకొక ప్రక్కనుంచి కాకాణి రమణా రెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి, వెంకయ్యగౌడ్‌ను కేసులనుంచి తప్పించడానికి మంత్రి, ముఖ్యమంత్రి పద్మనాభానికి ఫోన్లు చేశారని, అధికారులపై వత్తిడి తెచ్చారని ఆరోపించారట. రచ్చ పెరిగి పోతుండడంతో బాబుగారు జోక్యం చేసుకుని, చర్చ నిలిపివేశారట.

తర్వాత పత్రికలవారితో ముచ్చటిస్తూ, అవినీతి నిరోధమని అదేపనిగా ఊదర పెడుతున్నారే - మరి మీ మండలాధ్యక్షుల అక్రమాలసంగతేమిటని విలేఖరులు గట్టిగా గద్దించారు. సూళ్ళూరుపేట సమితి అధ్యక్షుడు దొంగసారా కేసులో చిక్కుకోవడం, జిల్లాపార్టీ కార్యదర్శి ఇంకా ప్రభుత్వసర్వీసులో వుండడం, బైరాగి మఠం కుంభకోణం తదితరాలన్నిటినీ ఉదాహరణలుగా చెప్పారు. బాబుగారు, ఇవన్నీ తప్పులేనని ఒప్పుకుంటూ, సాధ్యమైనంతత్వరలో ఈ పార్టీ సభ్యులపై చర్య తీసుకుంటామని హామీయిచ్చారు.

తాను జిల్లాలకు వచ్చినా అధికార యంత్రాంగాన్ని వాడడంలేదని ఆయన గొప్పగా చెప్తుంటే- విలేఖర్లు వెంటనే ఇప్పుడు మీకిచ్చిన పోలీసు బందోబస్తు మాటేమిటని ప్రశ్నించారు. పోలీసులు నాకోసంవచ్చారని మంత్రి సర్దిపోయారు; మరి ఇంతకుముందెప్పుడూ బందోబస్తు లేదుకదా అని అడిగితే, "మీరే రాలేదు కదా, మంత్రి పోలీసు బందోబస్తు లేనిదే కోవూరుకుకూడా పోలేకపోతున్నాడు' అని మా విలేఖరిని ఎత్తిపొడిచాడు.

జిల్లాపార్టీలో ముఠాతత్వాలు, భేదాభిప్రాయాలున్నమాట నిజమేనని, వుండడం కూడా సహజమని, సరిదిద్దడానికి ప్రయత్నిస్తామని చంద్రబాబు చెప్పారు. తర్వాత కార్యకర్తలసభ అనబడే, బహిరంగ సభ- తొలిహాలులో! దాన్ని బహిరంగసభ అనడంకూడా తప్పు; బాబుగారి కీర్తనలసభ అనడం సమంజసం.

'భజనచేసేవిధంలో' మంత్రిగారు అందర్నీ మించిపోయారు. చంద్రబాబు ఎక్కడో ఢిల్లీనుంచి ఊడిపడిన నాయకుడు కాడట- 'ప్రజలలో పుట్టి, పాతుకుని పోయి, కార్యకర్తగా దినదినాభివృద్ధి చెంది, నాయకుడైనా'డట; ఆయన 'పదవి



చంద్రబాబునాయుడు

కోసం ఎప్పుడూ అన్వేషించలేదట, పద వులే వెతుక్కునివచ్చి వరించా'యట. అటువంటి నాయకుడికి, పార్టీ అధినేతకు "స్వాగతంచెప్పే మహద్భాగ్యం కల్గినందుకు" సంతోషపడిపోతున్నానన్నాడు, శ్రీనివాసులురెడ్డి. చంద్రబాబు నీతినిజాయితీలను ఆయన ఉగ్గడిస్తుంటే, జనం నోరు తెరుచుకుని విన్నారు.

శ్రీనివాసులురెడ్డిగారు వేదికెక్కితే వాకౌటు ప్రస్తావన లేకుండా వుండలేరు. పాపం అది ఆయన బలహీనత. మంత్రిగా నేనేమీ చేయలేదని అభాండాలు వేస్తున్నారు. కానీ గతంలోవున్న జిల్లామంత్రి ఏమి చేశాడు? నా కొడుకును పోలీసు స్టేషనులో బంధించాడు; మా అన్నయ్యలపై దొంగకేసులు బనాయించాడు; మునసుబుద్యోగాలు పీకించడం, డీలర్లను తొలగించడం తప్ప ఆయన జిల్లాకేమిచేశాడు. నేను 3 కోట్ల రూపాయల రోడ్డుపనులు తెచ్చాను. 30 హాస్టళ్ళు తెచ్చాను. 10 వేల ఇళ్ళు కట్టిస్తున్నాం. కావలి కాల్వ పూర్తి చేస్తున్నాం. తెలుగు గంగ ద్వారా నెల్లూరుకు నీళ్ళు తెచ్చాను. కావలిలో ఐటిఐ, నెల్లూరులో స్త్రీల పాలిటెక్నిక్ పెట్టుకున్నాం..... అంటూ మంత్రిగారు దండకం చదివారు. బాబు మెప్పుపొందడం కోసమనుకుంటాము ఈ స్వకుచమర్దన.

ఆయనకు ముందు బెజవాడ పాపిరెడ్డి, రాష్ట్ర తెలుగుమహిళ వసుమతిదేవి, తెలుగురైతు, తెలుగు విద్యార్థి, తెలుగు కార్మిక సంఘాల నాయకులు మాట్లాడారు.

చంద్రబాబునాయుడు ప్రసంగంలో సారంలేదు. తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చినతర్వాత అవినీతి పూర్తిగా నిర్మూలనైపోయిందని, తమను తమమంత్రులను ఎవరూ వ్రేలెత్తిచూపలేకపోతున్నారని అన్నారాయన. కాంగ్రెసు పార్టీకి నీతి నియమాలగురించి మాట్లాడేహక్కుకూడా లేదని అయనంటుంటే, జనం విన్నారు.

సభ తర్వాత గెస్టుహౌస్‌లో మరొక దర్బారు. కావలి సమస్య పెద్ద చికాకైనట్టుంది. నారాయణ వర్గాన్ని లోపలకు పిలిచి చడామడా తిట్టాడట; సస్పెండ్ చేస్తానన్నాడట. వారు రాగానే రమేష్ రెడ్డి బృందం టౌన్ కమిటీ విషయం ప్రస్తావించిందట; బాబుగారు వారిపైకి లేచి, ఈ జిల్లాలో పార్టీకి క్యాన్సర్‌రోగం పట్టింది. మేజర్ ఆపరేషన్ చేసేస్తాను జాగ్రత్త అని బెదరించి, బైటకు పంపాడట. తర్వాత వివేకానందరెడ్డి ఇట్టు వెళ్ళింది వారికి ఇదేమోస్తరు సమాధానం లభించినట్టుంది. చివర్న డాక్టర్ ప్రభాకర నాయుడ్ని, సూళ్ళూరుపేట మునిరెడ్డిని ప్రత్యేకంగా పిలిచి, చెవిలో ఏదో ఊది, రాత్రి 11 గంటల సమయంలో ఒంగోలుకు కారెక్కారు. ఇదీ శ్రీమాన్ చంద్రబాబులవారి ఏకదిన పర్యటనా విశేష సమస్తరంబు!

• • •

# చంద్రబాబు సమక్షంలో రెవిన్యూ మంత్రి స్వోత్కర్ష

బాబు పర్యటన ఒక ఎత్తయితే, ఆయన దగ్గర తమ కెక్కువ చనువుందని నిరూపించుకోవడానికి ముఠానాయకులు వేసినవేషాలు, పడ్డపాట్లు మరొక ఎత్తుగా కన్పించాయి. ఎమ్మెల్యే శ్రీ ఆనం రామనారాయణరెడ్డి ముందురోజు రాత్రే చిలకలూరిపేట దగ్గర దారికాచి నిలబడ్డాడట; గుంటూరునుంచి వస్తుండిన బాబుని తన కారులోకి ఎక్కించుకుని, డ్రైవరుకూడా తానే అయి, భద్రంగా నెల్లూరు చేర్చాడు. ఆయన వర్గీయులుమాత్రం, రామానారాయణ రాపూరు పోయాడని ముందురోజు ఇక్కడతప్పుడుప్రచారంచేశారు. అది నిజమేనని నమ్మి, తామూ సైగ్గావుండిన నల్లపరెడ్డివర్గీయులకు, ఆనం కారునుంచి బాబు దిగగానే కళ్ళు బైర్లు క్రమ్మాయటపాపం.

# జిల్లాలో కాంగ్రెస్ గతి ఇంతేనా?

జిల్లాలో కాంగ్రెస్ కార్యకలాపాలే కొరవడిపోయాయి. కొరవడడంకాదు, స్తంభించిపోయాయనడం సముచితంగా వుంటుంది. ఇది ఎందువల్లనో జరిగిందని, దీనికి ఎవరో కారకులని నిందించడం మాఫ్రత్యేకంగాదు. ఉన్నపరిస్థితి ఇది. ఈపరిస్థితి కాంగ్రెస్‌వాదులమనుకునేవారు ఆవేదన చెందుతున్నారు.

వెంగళరావుగారి వృద్ధాప్యమో, మరే కారణమో జనార్ధనరెడ్డి "జనప్రియ" నుండి కాలు బయటపెట్టడంలేదు. కనీసం నెల్లూరుకు నెలకు రెండుసార్లువచ్చి జిల్లాలోని కాంగ్రెస్ కార్యకర్తలందరినిచేర్చి ఏదో కార్యక్రమం పురమాయించి కాంగ్రెస్ వున్నదనిపిస్తుందిన జనార్ధనరెడ్డి రాకే అవ్వడు కరవైపోయింది; వచ్చినా చుట్టపుచూపే! అన్నివర్గాల సమన్వయ కర్తగా వుండగలడని కాంగ్రెస్‌వాదుల 'అభిప్రాయ' మన్నించి పనిని అధ్యక్షుడు జి కాం. అధ్యక్షుడుగా నామినేట్ చేసి పోయిన శ్రీ కె. వి. సుబ్బారెడ్డి ఏమిచేస్తున్నారో తెలియదు; బహుశా ఆయనకాలం శాసనసభ్యుడుగా తన విధులు నిర్వర్తించడానికే సరిపోతుండవచ్చు. కార్యవర్గ సమావేశంకాని మరొకటిగాని మరొకటిగాని లేదు. మొన్న రాజీవ్‌గాంధీ వచ్చినప్పుడు గుంటూరుకు ఒకటో రెండో బస్సులనిండా జనాన్ని తీసుకపోయారట. కాని అది జిల్లాలో కాంగ్రెస్‌వాదులను కార్యోన్ముఖులను చేయగల కార్యక్రమం కాజాలదు.

శాసనసభ్యులు నలుగురు ఒకటిగా వున్నారో, నాలుగుగావున్నారో తెలియదు. జి. కాం. అధ్యక్ష నిర్ణయబాధ్యతైతే వీరు నిర్వర్తించి వుండవచ్చు కాని, తమతమ నియోజకవర్గ బంధులను దాటి పనిచేసే అవకాశము అవసరము అంతస్తు వారికి లేకపోవచ్చు. అందులో పాపం రాజమోహనరెడ్డి వంటి వ్యక్తికి పార్టీ వ్యవహారాల రంగం నీళ్ళలో నుండి బయటవేసిన చేప చందంగా వుండవచ్చు. డాక్టరుకు ప్రాక్టీసు బంధం; యానాదిరెడ్డికి తరచు మద్రాసు–హైదరాబాదు ప్రయాణాలతో సరిపోతుంది. వీరికి ప్రత్యేకంగా కాంగ్రెస్ సంస్థ కార్యకలాపాలను చూచే టైం వుండదు.

అనం సంజీవరెడ్డిగారున్నారు ఆరోజు వెంగళరావుగారి రాకసందర్భంలో జి.

ఒక కాంగ్రెస్ వాది

కాం. అధ్యక్షపదవిలో తనపాత్రనేదో చురుగ్గా నిర్వహించాడుగాని, తర్వాత ఎప్పటివలెనే ఆయన సర్దుకున్నారు;

రెండుజిల్లాలలో కాంగ్రెస్‌ను సువ్యవస్థీకరించడానికి ప్రత్యేకంగా నియమించబడిన ఆర్గనైజింగ్ కార్యదర్శి శ్రీ వంటేరు రమణారెడ్డి సంగతి–ఆర్యోకేలు, కావలి అనే అక్రమకు ప్రామకోపిలసినట్లుగా వుంది. ఆయన వెంగళరావుగారివద్ద హాజరుపడే బయట కార్యక్రమాలకు పోయివస్తున్నట్లుందిగాని, జిల్లాలోసంగతి పట్టించుకోవడంలేదు. అసలు తన అనుయాయుడనే అభిమానంతో వెంగళరావుగారు వరప్రసాదంచేయడంతప్ప, రమణారెడ్డిగారికి ఎవరుతెలిసి ఏమితెలిసి ఎక్కడకుపోతాడు చెప్పండి?

జిల్లావ్యాప్తంగా జనార్ధనరెడ్డి అనుచరవర్గంవుంది. పసల పెంచలయ్య, సి. వి. శేషారెడ్డి, శంకరరెడ్డి వంటి కాంగ్రెస్ అంటే పడిచచ్చే కార్యకర్తలెందరో వున్నారు. వారంతా నిరుత్సాహంతో, నిస్పృహతో చేతులుముడుచుకొనికూర్చుని వున్నారు. శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి వంటి పెద్దలు కాంగ్రెస్‌ను తమకు దూరంచేసేశారేమోనని భావిస్తున్నట్టుంది.

తెలుగుదేశం విజృంభిస్తున్నది; గ్రామగ్రామానికి వ్యాపిస్తున్నది. మొన్న చంద్రబాబునాయుడు వచ్చినప్పుడు ఎంత హడావిడి చేశారో చూశారుగదా! పరిపాలనా యంత్రాంగంమీద వారి ఒత్తిడులు ఎక్కువవుతున్నాయి. వారిదెబ్బకు అధికారులుకూడా భయపడిపోతున్నారు. పరిపాలన 'వనవే' అయ్యే ప్రమాదం ముంచుకొస్తున్నది. మూడుమాసాలలోగా సహకారసంస్థలకు ఎన్నికలు జరగనున్నాయి. మండల ఎన్నికలు ఎప్పుడు దూకుతాయో చెప్పలేము. మునిసిపాలిటీలలో ఓటర్లలిస్టు సవరణ జరుగుతున్నది; వాటికీ ఎన్నికలు ముంచుకరావచ్చు. ఈ విధంగా కాంగ్రెస్ ఎదుర్కోవలసిన సవాళ్ళు ఎన్నో వున్నాయి.

ఈ పరిస్థితుల్లో కాంగ్రెస్‌కు ఈగతి పట్టడం కాంగ్రెసువాదులకేకాదు, ప్రజాస్వామ్యవాదులందరికీకూడా మనస్తాపం కలిగిస్తున్నది. కాంగ్రెస్‌ను ఈవిధంగానే వచ్చీరావని స్థితిలోవుంచి తెలుగుదేశానికి మార్గం నిష్కంటకం చేయడమా? లేక, కాంగ్రెస్ కార్యకలాపాలను ముమ్మరంచేసి ప్రజలలోకి చొచ్చుకపోయి తనపూర్వస్థానాన్ని పొందడమా? వారు వీరని కాకుండా జిల్లాలోని బాధ్యతగల కాంగ్రెస్ నాయకులందరూ దీనినిగూర్చి తీవ్రంగా ఆలోచించాలని మాకోర్కె. ★

## సెబాష్ విద్యామంత్రీ సెబాష్!

(మొదటి పేజీ కొరవ)

తెలుసుకోవడానికి!

లెక్చరర్లు తమకాలాన్ని ట్యూషన్స్‌కే పరిమితం చేసుకోవడంవల్లనే కాలేజీలు భ్రష్టుపట్టిపోతున్నాయి. విద్యార్థులలో కాలేజీలపట్ల శ్రద్ధ లోపించడానికి, లెక్చరర్లపట్ల భయభక్తులు నశించడానికికూడా ఈ ట్యూషన్లు ఒక కారణమే. పైపెచ్చు, లెక్చరర్లకు పాఠాలకంటే బయట వ్యాపకాలు పెరిగిపోవడంవల్ల ఇటు విద్యావ్యవస్థ నిర్వహణకూడా భ్రష్టుపట్టిపోతున్నది. విద్యామంత్రే చెప్పినట్లు. పరీక్షలయిన్నీ తీసుకుని రారు. ప్రశ్నాపత్రాలు దిద్దడానికి ఎగ్గొడతారు. రికార్డులు, గికార్డులు మెయిన్‌టైన్‌చేసే డ్యూటీలు విస్మరిస్తున్నారు. సిలబస్ పూర్తిచేయరు. కాలేజీలలో జరిగే ఇంటర్నల్ పరీక్షల నిర్వహణ అసలేలేదు. ట్యూషన్లకు విద్యార్థులను ఆకర్షించడానికే వీరు కాలేజీలకొచ్చేది.

ఇటువంటి విశృంఖల ధోరణులకు లెక్చరర్లనే తప్పుపట్టనేము; ఆయా కాలేజీ యాజమాన్యాల బాధ్యతకూడా వుంది. వి. ఆర్. కాలేజి వ్యవహారమే చూడండి. లెక్చరర్లలో ముప్పాతికభాగం మందికి స్వంత వ్యాపారాలున్నాయి. కొట్లు పెట్టుకునేవారు కొందరైతే, కోళ్ళఫారాలు నడుపుకునేవారు ఇంకొందరు. తీరిక వేళల్లోనే వీరు కాలేజీలకు హాజరయ్యేది. ఈ వ్యాపకాలన్నీ యాజమాన్యానికి తెలును. కానీ, పొరపాటునకూడా ఎవరినీ ప్రశ్నించి ఎరుగదు. లెక్చరర్లకు కాలేజి ఒక కాలక్షేపపు కేంద్రమైతే, యాజమాన్యానికి అదొక రాజకీయ పునరావాస కేంద్రం. విద్యాసంస్థల ఈ దశకు [illegible] తే, విద్యాప్రమాణాల గురించి మాట్లాడడమెందుకు, దండగ.

విద్యామంత్రి అంటే ముద్దుకృష్ణమనాయుడే విద్యామంత్రి అనే పేరు వచ్చింది ఇప్పుడు. కోచింగ్ సెంటర్ల భరతం పట్టడానికి కంకణం కట్టుకున్నాడనే కాదు– ఆయన వచ్చినతర్వాత 10 వ తరగతి, ఇంటర్మీడియెట్ పరీక్షలు సకాలంలో జరుగుతున్నాయి. ఫలితాలుకూడా సక్రమంగా వెలువడుతున్నాయి. వాయిదాలకు మారుపేరుగా వుండిన విద్యాసంవత్సరాన్ని గాడిలోకి దారిలో పెట్టారు. పరీక్షలముందు సమ్మెకు దిగేవారిని బెదిరించి [illegible] కాలేజీ ఇకర టీచర్ల సంఘాలనుకూడా ఆయన సమర్థవంతంగా దారికితెచ్చారు. ఏమైనా ముద్దుకృష్ణమనాయుడుగారిని సెబాష్ విద్యామంత్రీ, సెబాష్ అనాలనిపిస్తున్నది.

అయితే ఒక్కరోజు దాడులతోనే విద్యావ్యాపారులు అదుపుకురారు, నిరంతర తనిఖీలు కొనసాగించడం ప్రభుత్వ కర్తవ్యం. ★



నాయుడుపేట డాక్టర్ పెన్నేపల్లి మోహనకృష్ణ తమ తల్లిగారైన స్వర్గీయ పెన్నేపల్లి రుక్మిణమ్మగారి జ్ఞాపకార్థం నాయుడుపేట జి.వ హైస్కూల్ ఆవరణంలో 10 వేల రూపాయల వ్యయంతో నిర్మించిన 'సరస్వతీ మంటపం'ను 19 తేది నెల్లూరు జి.వ. విద్యాశాఖాధికారి పులి పిచ్చమ్మగారు ప్రారంభోత్సవం చేసిన సందర్భంలో డాక్టర్ మోహనకృష్ణ, పులి పిచ్చమ్మ, నాయుడుపేట జ.ఐ. శాస్త్రి, జి.వ. ప్రధానోపాధ్యాయుడు కృష్ణమూర్తి

## శ్రీ కాళహస్తి 1వ డి॥ ము॥ కోర్టులో

E. P. No. 137 of 1984 — O. S. No 229 of 1983

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఎ డి బి) శ్రీ కాళహస్తి— డి.హో./వాది

1. మద్దెల చినబక్కయ్య, 2 మద్దెల పురుషోత్తం
3. చిట్టేలి ఒబెయ్య — జె డి ఆ /ప్రతివాదులు

### వేలం ప్రకటన

పై దావాలోని డిక్రీ బాకీ వగయిరాలు రాబట్టుకొనుటకు గాను మొదటి వంతివాది (First J Dr.) బాధ్య పడియుండు క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పై కోర్టులో 28 4-1986 తేదీన ఉదయము 10-30 గం॥కు బహిరంగముగా వేలము వేయుదురు పాటదారులు హాజరై పాడుకొనవచ్చును

— షెడ్యూలు —

చిత్తూరుజిల్లా శ్రీ కాళహస్తి తాలూకా ఎర్రగుడిపాడు గ్రామ పొలంలో

| వ. నం. | సర్వే నం. | పుంజ లేక నంజ | విస్తీర్ణం | హెక్టారు | వాది క్రయం | కోర్టువారి క్రయం |
|---|---|---|---|---|---|---|
| 1) | 57 44 | నంజ | 0-09 | 0.036 | 100/- | 450/- |
| 2) | 57 45 | .. | 0-03 | 0.012 | 75/- | 150/ |
| 3) | 57.38 | .. | 0-54 | 0.218 | 1200/- | 2700/- |
| 4) | 56-8 | .. | 0-10 | 0.040 | 100/- | 500/- |
| 5) | 56 10 | .. | 0-20 | 0,080 | 250/- | 1000/- |
| 6) | 56-6 | .. | 0-20 | 0.080 | 250/- | 1000/- |
| 7) | 56-2 | .. | 0 05 | 0 020 | 100/- | 250/- |

పై కనిన భూములపై ఎలాంటి తాకట్టులు లేవు — వేలం తేది 28-4-86

—యద్దనపూడి సత్యనారాయణ
డి.హో. వరం అడ్వొకేటు శ్రీకాళహస్తి



## శివారెడ్డి పద్యాలు

శివకామేశ్వరి యజ్ఞము

శివకామేశ్వరి యజ్ఞము
భవతాపహరమ్ము,ముక్తబంధము ఇదిమా
నవకోటికెల్ల. సెపితే
నవనాగరికమ్ము దీన్ని నమ్ముర్దాంతా?

నేను చిన్న కన్న నెల్లూరుజిల్లాలో
యింత పెద్దయజ్ఞ మీమహత్తు
కంచిగరుడసేవ కైలాసపట్నంగ
లెక్కలోబడింది లేగ్న పాడు

ప్రతిదినమ్ము వేదపారాయణము గీత,
నాటకాలు. సభలు పూటపూట.
విందుభోజనాలు సందేల పూరూర
పల్లెపల్లెజనము బట్టహాలు!

విందుగూర్చెదెవికి వేదాంతశ్రవణమ్ము
ధన్యమాయె బుధుల దైవసముల
దర్శనమున కనులు, దరిచేరబోడింక
కడపట్రొక్కడింక కాలయముడు!

చీట్లాటకు, పోట్లాటకు
కొట్లాటకు పేరుబడ్డ కుగ్రామంలో
యిట్లాజరుగుద్దని మన
మెట్లా వూహించగలము

ప్రతములాచరించు, క్రతువులెన్నొజెయ్యి
వరుసబెట్టి గీత వల్లెవెయ్యి
రాడుముక్తి నిన్ను రామయ్య నిసంగ
తెర్తుకోదు, లేక చిత్తశుద్ధి!

అపునెల్యకాస్త అగ్నిహోత్రముపాలు,
కావిగుడ్డపాలు కాషివుస్క,
మంచినీళ్ళపాలు మాలాంటికవులంత,
యిదిభలోక్తి కవికి యేదిబల్ల!

రామారావు

అరి పిడబట్న, దాహము
మితిమీరిపోయింది నీకు మిక్కుటమైంది?
మతిస్థిమితములేదు, దేశము
నతమతమైపోర్ది, ధర్మసంకటమౌర్ది!

పైన కాంగ్రెసోరు పట్టించుకోబోరు,
రాజీవయ్య అదొకరకముమనిపి
ఉందుచేత నీవు ఆడింది ఆటైంది
నందమూరు! నిజము నాకుతెలుసు!

రాజీవగాంధి

కళ్ళు మూసుతెరుస్తు కాచుకోనుంటుంది
సమయమునకు ఘోరసర్పజాతి
కాటువెయకపోదు, కాలాని కెదురీత
తనికిరాదు, గాంధి ప్రైమినిష్టు!

మెత్తగుండెకాదు బెత్తమాడించాలి
కప్పు పామొర్ది గమ్ముగుంటి,
ముప్పు దేశమునకు మున్ముందు రాజీవ!
ఆలొచించు మనవి ఆలకించు!

## నామాట

(4 పేజి కొంవ)

లకు ఒక ఆసరా, ఆండ కల్పించడమే ఈ శిశుపోషణాలయం లక్ష్యం. పొద్దున పనికివెళ్ళే కూలీతల్లులు- ఐదేళ్ళలోపు పిల్లలను ఇక్కడవదిలిపోవచ్చు: సాయంత్రం వరకు వారి ఆలనాపాలనాచూడడం భోజనం పెట్టడం, నాలుగైదేళ్ళవయస్సు పిల్లలకు చదువుచెప్పడం, మంచి అలవాట్లు నేర్పించడం పోషణాలయం తన బాధ్యతగా స్వీకరిస్తుంది.

1983 లో డాక్టర్ రాజమ్మ ఈ కెంప్రెస్ స్థాపించింది. అప్పట్లో ఆమెకు మద్రాసులోని సర్వెంట్స్ ఆఫ్ ఇండియా ఆర్థిక సహాయంకూడా లభించింది. కానీ, ఒక్కసంవత్సరానికే వారా హెల్ప్ నిలిపి వేశారట, అయినా రాజమ్మ పోషణాలయం నిలపకుండా, స్వంత ఖర్చుతో నడిపిస్తూవుంది. ఇటీవల కొంతకాలం నుంచి, ఆదిమజాతి సేవక్ సంఘ్ కొంత చేయూత నిస్తుందట.

తన ఇంట్లోనే మూడు గదులు ఇందు కోసం కేటాయించిందామె ఇద్దరు ఆయా లున్నారు. ఒక టీచర్ వీరికి రోజూ చదువు చెప్తుంది. ఆడుకోను ఆట వస్తువులున్నాయి. రాజమ్మగారే పిల్లలవైద్యంలో చేయి తిరిగిన నిపుణురాలు కావడంతో, ఆరోగ్య విషయాలు ఆమే చూస్తున్నది, రోజూ కనీసం 50 మంది పిల్లలు ఇక్కడ సేదదీరుతుంటారు.

నిశ్శబ్దంగా, నిరుపమానంగా, ప్రచారార్భాటాలు లేకుండా నడుపుతూంది దీన్ని డాక్టర్ రాజమ్మ. వదాన్యుల సహకారం లభిస్తే, ఈ సత్కార్యం శాశ్వతీకరించే వీలుదొరుకుతుంది.

• • •

ఏ సి కూరలమార్కెట్, ట్రెకనేరోడ్డు చేపలమార్కెట్ తూకాల మోసాల కు కేంద్రాలుగా వున్నాయని అలజడిగా వుంది. కొన్ని తక్కెళ్లకు మధ్యలో ముళ్లే వుండడంలేదట. కిలో బండాతిక కిలో తూకం లేదా వస్తుందట. ఈ నిట్ట నిలువు దోపిడికి వినియోగదారులు ఆరిపోతున్నారు. తూనికలు కొలతలశాఖ తూగుతూవుందా? వెంటనే మేలుకోండి- లేకుంటే మత్తు వదలగొట్టవలసి వస్తుంది.

## పినాకినీ తీరం

(2వ పేజి కొరవ)

పురావస్తు శిల్పసంబంధమైన అనుబంధం. కృష్ణమూర్తిగారు మనజిల్లాలోని అనేక దేవాలయాల శిల్పాలను అధ్యయనం చేశారు, వాటి కాలాన్ని చరిత్రను తెల్పారు. కష్టాపట్నంలో పాడుబడిన దేవాలయ గోపురపు గోడల శిల్పాలు అపురూపమైనవని కృష్ణమూర్తిగారు వ్రాశారు. అట్లనే భైరవుకోన శిల్పాలను కూడా వెలుగులోకి తెచ్చారు.

కృష్ణమూర్తిగారిని గురించి 'జమీన్ రైతు' పాత పాఠకులకు పరిచయం చేయాల్సిన అవసరంలేదు, దేవాలయాల శిల్పకళనుగూర్చి, మనజిల్లాలోని దేవాలయాలనుగూర్చి ఆయనఎన్నోవ్యాసాలు వ్రాశారు. 'జమీన్‌రైతు' ఉగాది సంచిక అంటే కృష్ణమూర్తిగారి వ్యాసం వుండి తీరవలసిందే, బహుశా పాఠకేర్పకు ముందు వుంటుంది- కీ శే. చతుర్వేదుల రామచంద్రయ్యగారు దేశాటనకు పోయారు. నేను ఆయన పోతే ఏమి తెలుసుకోగలం?- అన్ని ముఖ్యప్రదేశాలు చూడడానికి, అన్ని విషయాలు సమగ్రంగా తెలుసుకోడానికి విజ్ఞానఖనియైన ఎం. ఎస్. కృష్ణమూర్తిగారిని వెంట తీసుకెళ్ళారు. అప్పుడు కృష్ణమూర్తిగారు తాము చూచిన విశేషాలను ప్రతివారం వ్యాసరూపంలో జమీన్‌రైతు పాఠకుల చేత చదివించారు, హైదరాబాదు కు పోకుండా నెల్లూరులో కుర్చొని సాలార్ జంగ్ మ్యూజియంను నేను చూచింది అప్పుడే!

కృష్ణమూర్తిగారినిగూర్చి నాకు తెలిసిందిలాంటోర్ది తెలిసినవారు ఆయన్నుగూర్చి ఒక చిన్నపుస్తకమే వ్రాయొచ్చు. నెల్లూరు సన్మానాన్ని పొందిన శ్రీ కృష్ణమూర్తిగారికి నా గౌరవాభివందనలుకూడా తెలియజేస్తూ, గోపాలరెడ్డిగారివలె వెయ్యి మాసాలుజీవుండా నూరేళ్లు జీవించాలని ఆకాంక్షిస్తున్నాను.

—నేను

## పంచాంగం

### ముహూర్తములు

మే 10, 11, 16, 18, 21, 23, 25 తేదులలో వివాహ మరియు శుభ కార్యములు చేయవచ్చును.

### ఏప్రిల్ తిథులు

26 శని విదియ ప. 1-45 గం. వ.
27 ఆది తదియ ప. 11-20 గం. వ.
28 సోమ చవితి ఉ. 8-51 గం. వ.
29 మంగళ పంచమి ఉ. 6-30గం.వ.
షష్ఠి తె. 4-13 గం. వ.
30 బుధ సప్తమి రా. 2-11 గం. వ.

### మే తిథులు

1 గురు అష్టమి రా 11-48 గం. వ.
2 శుక్ర నవమి రా. 11-13 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

## నెల్లూరు అఫిషియల్ రిశీవరు కోర్టులో

నెల్లూరు సబ్‌కోర్టు

ఐ పి 5/60, 12/60, అండ్ 13/60

దొడ్ల వెంకటసుబ్బారెడ్డి, కొండాయపాళెం — ఇన్‌సాల్వెంటు

పైనెంబరు ఐ. పి. లలో ఆయా బాకీదారులు దాఖలు చేసుకున్నటువంటి బాకీ రుజువుపత్రములను ఎవరైనా ఆక్షేపించదలచిన అట్టి ఆక్షేపణలను ఈఆఫీసులో తే 31-5-86 దిలోగా వ్రాతమూలకముగా దాఖలుచేసుకొనవలయును.

—వి. అంకిరెడ్డి,
అఫిషియల్ రిశీవరు, నెల్లూరు

## కావలి డి॥ ము॥ కోర్టులో

O. S. No. 15 of 80

పి. వెంకటసుబ్బయ్య — వాది.
పొన్నలూరు శ్రీదేవమ్మ — ప్రతివాది.

రిసీవరు యాలం నోటీసు

ప్రతివాది తాలూకు కోవూరుపల్లిగ్రామ కావల తాలూకాలోయున్న ఈ క్రింది షెడ్యూలుదాఖలా మెట్టభూమి పైకొరు అపరణంలో రిసీవరుచే తే 3-5-86 ది మధ్యాహ్నం 3 గంటలకు యాలం జరుపబడును పాటదారు పాటకాలములో రు 500 లు ధరావత్తు చెల్లించవలెను. పాట అగగానే 1/4 వంతు పైకంచెల్లించి కొరవ 15 రోజులలో చెల్లించవలెను. అట్లా చెల్లించనియెడల యాలం తిరుండా రద్దుపరచబడి తిరిగా 1/4వంతుమొత్తం జప్తు చెయబడి యాలం జరుపబడును.

| సర్వే నెం. | య సెం. |
|---|---|
| 197 | 22—94 |
| 194 | 5—07 |
| 198 | 10—92 |
| 199 | 29—91 |
| 193/1 | 5—54 |
| 193/2 | 0—35 |
| 195 | 9—58 |
| | య 84—01 సెం |

లో ప్రతివాది తాలూకు అవిభాగముగా వియ 21-00 లు మెట్టభూమి. గవర్నమెంటువాట రూ 15,000 లు.

—పర్చూరి శ్రీనివాసమూర్తి,
అడ్వకేటు, కావలి.



'సీతారామకళ్యాణం' లో బాలకృష్ణ, రజని

## చచ్చుకథ, చౌకబారు చిత్రణ
# సీతారామకళ్యాణం

**సమీక్ష**
గ్రిద్దలూరు గోపాలరావు

రాజా, లక్ష్మి కాలేజీలో చదువుతూ ప్రేమించుకుంటారు. గతాన్ని తిరగ తోడగా యిద్దరూ చిన్ననాటి దగ్గరబంధువులయ్యారు. కుటుంబ పెద్దల పాతకక్షల మూలంగా వీరి పెళ్ళికి అటంకం కలుగుతుంది. లక్ష్మి అన్న, హరి ఆమెను తన దగ్గరబంధువుకిచ్చి పెళ్ళిచెయ్యాలనిపట్టు బట్టుతాడు. ఇక హరి, రాజాల మధ్య హోరాహోరీ ఫైటింగులు, బంధువుల్లో హత్యలు జరిగిన తర్వాత అందరికీ కనువిప్పు కలిగి, లక్ష్మిని రాజాకిచ్చి పెళ్ళి చేస్తారు.

ఈ పుచ్చుకథను చిత్రానువాదం చెయ్యటంలో జంధ్యాల, మురారి మరీ చెత్తగా తయారుచేశారు. పనికిమాలిన సన్నివేశాలు, ఫైటింగులుదాలాచొప్పించి చిత్రాన్ని సాగదీసి విసుగెత్తించారు. చాలాచాలా పాతసరకుచేర్చి ముఖం మొత్తించారు.

చిత్రం ప్రారంభంలో పర్నాలుగు సంవత్సరాలకథను రాజా, లక్ష్మి కుటుంబాలకు సంబంధించినదాన్ని సరిమాటల్లో భారతయుద్ధంలాంటి ఒక పెద్ద కొట్లాటతో పదినిముషాల్లో చూపించి గందరగోళం చేసేశాడు దర్శకుడు జంధ్యాల. కురుసంతతి లాంటి ఆ కుటుంబ సభ్యులు ఎవరు ఎవరు ఎవరికి ఏమవుతారో తెలుసుకోలేక తికమకపడిపోవలసివస్తుంది. ఆరంభంలోనే ఇంత అయోమయస్థితి సృష్టించడంతో, దర్శకుడు తానేమిచెప్పదలచుకున్నది కొనదాకా చెప్పలేక పోయాడు.

జంధ్యాలకు తనచిత్రాల్లో అక్కడక్కడా కొన్నిపాత్రలను టఫీమని మాయం చెయ్యడం, మరోచోట టకీమని చూపడం పరిపాటి. ఎవరినైనా చిత్తుగా కొట్టినపుడు మద్దెల వాయించినట్లో, గుడ్డలు వుతికినట్లోచూపడం అలవాటు. ఇన్నిచిత్రాల తర్వాతకూడా దర్శకుని మేధకు వేరే కొత్తప్రక్రియ తట్టినట్టులేదు. అపాత అలవాట్లే యిందులోనూ చోటుచేసుకున్నాయి.

రాజా, లక్ష్మిల మధ్య కాలేజి ఆవరణంలో చూపిన ప్రేమసన్నివేశాలు చాలా చౌకబారుగా వున్నాయి. లక్ష్మి రాజాను, చూచి చిరునవ్వులతో పలుకరిస్తూ, వాలు చూపులతో పిలుస్తూవున్నా అది అర్థం చేసుకోలేక యింకా ఆమె ప్రేమిస్తూందో లేదో తెలుసుకునేందుకు పావలారూకతో ప్రేమను లాటరీపద్ధతికి దించిన విధానం దిగదుడుపుగా వుంది.

లక్ష్మిపెళ్ళి యిక పదిరోజుల్లో జరుగుతుందనగా రాజాను అజ్ఞాతవాసంలోకి ఎందుకు పంపవలసివచ్చిందో మనకర్థం కాదు. రాజాఅన్నను హత్యచేసిన సన్నివేశం మరీ పేలవంగావుంది.

కాలేజి లైబ్రేరియన్ భార్య పాత్రకు ఒకస్థూలకాయురాలిని ఎన్నుకొని ఆమెకు బండెముకుపెట్టి హాస్యం సృష్టించాలని ప్రయత్నించాడు దర్శకుడు. స్థూలకాయాలమీద హాస్యంచూపటం చాలాకొత్తగా

—కొరవ 11వ పేజీలో



అమ్మాయిలూ జాగ్రత్త!

# సినిమాలోక మొకవూబి- కాలుజారిందా అంతే చెల్లు!

తాను శ్రీదేవి లాగానో, భానుప్రియ లాగానో పెద్దస్టార్ అయిపోవాలనుకుంది ఓ అందమైన యువతి, ఆమెపేరు ఉమారాణి. కోయంబత్తూరులో 9వ తరగతి చదువుకుంటూంది. ఈమె అభిమాననటుడు మోహన్. పత్రికలలో పడే ఆ హీరో ఫోటోలను కత్తిరించి, పెద్దఆల్బమ్ తయారుచేసింది. అతనిద్వారా సినిమా రంగంలో ప్రవేశించాలని ఆశపడింది. ఉన్నట్లుండి ఆ అమ్మాయి ఇంట్లో తల్లిదండ్రులకు చెప్పకుండా తాను చేర్చి వుంచిన యాభైరూపాయలతో ట్రెయిన్‌లో మద్రాసుకు చేరుకుంది. సినిమాడైరీలోని మోహన్ అడ్రసు ప్రకారం అతని యిల్లు వెతుక్కుంటూ వెళ్ళింది. మోహన్‌కు తన ఆశగురించి చెప్పింది. ఆమెకు మోహన్ బుద్ధి చెప్పి, వాళ్ళ ఊరికి వెళ్ళిపొమ్మని ఎంతగా నచ్చ చెప్పినా ప్రయోజనం లేకపోయింది. చివరికి పోలీసులకు ఫోన్‌చేసి, వాళ్ళకు ఆ అమ్మాయిని అప్పగించాడు. పోలీసులు ఆ అమ్మాయి తల్లిదండ్రులకు కబురు చేశారు.

ఇలా సినిమాలోచేరితే ఐశ్వర్యంతోపాటు కీర్తివస్తుందని భ్రమపడే అమాయకురాళ్ళు మనరాష్ట్రంలోకూడా ఎందరో ఉన్నారు. కొంతకాలంక్రితం ఇద్దరు యువతులు ఇలాగే మద్రాసుకువచ్చి, కృష్ణంరాజును కలుసుకున్నారు. ఆయన వాళ్ళకు బుద్ధిజెప్పి, తన స్వంత ఖర్చులతో వాళ్ళవూరికి చేర్పించాడు.

కాని, ఇలాంటి అమాయక యువతుల కోసం ఎదురుచూసే కొందరు దుష్టులున్నారు. వాళ్ళకు తప్పకుండా సినిమా ఛాన్సులు ఇప్పిస్తామని మభ్యపెట్టి పడుపువృత్తిలోకి దింపి, వాళ్ళజీవితాలను నాశనంచేసిన సంఘటనలు ఇటీవల బయటపడ్డాయి. అలాంటి దుర్మార్గులు కొందర్ని పోలీసులు పట్టుకున్నారుకూడా. అందేత, ఇలా సినీమాయలోపడి, తమ జీవితాలు నాశనం చేసుకోకుండా యువతులు జాగ్రత్తపడాలి.

### "నిర్మాత అరెస్టు!" వార్త గురించి తికమకలు

ఎప్పుడో అక్కినేని నాగేశ్వరరావుతో చిత్రాన్నితీసిన గోపాలరెడ్డి అనేఆయన్ని పోలీసులు కస్టడీలో తీసుకున్నారు. రాత్రి వేళల్లో, లారీ, కర్లు వగైరా వాహనాలను పరిశోధించే పోలీసుమీద కారునుపోనిచ్చి హత్యచేయడానికి ప్రయత్నించాడనే అభియోగంమీద గోపాలరెడ్డితోపాటు ఆ కార్లో వున్న మురళీకృష్ణారెడ్డినికూడా ఖైదు చేశారు.

ఏప్రెల్ 14 తేది రాత్రి విమానంలా దూసుకవస్తున్న ఒకమారుతీకారుమీదసందేహం కలిగి చెకిన్‌గ్రౌండ్డవద్ద ఆపమని సైగ చేశాడు కానిస్టేబిల్ దాసు. దాన్ని అతి నట్లు నటించి, వెంటనే దాన్ని దాసుమీదికితోలి, రయ్‌మని దూసుకుపోయిందా కారు. గాయపడ్డ దాసును వెంటనే స్టేట్ ఆసుపత్రిలో చేర్పించారు.

పోలీసులు చురుకుగా అన్వేషించి కారును మింట్ స్ట్రీట్‌వద్దపట్టుకున్నారు. కారులోవున్న గోపాలరెడ్డిని,మురళీకృష్ణారెడ్డిని విచారించగా కొన్నివిషయాలు బయటపడ్డాయి. గోపాలరెడ్డికి కొన్ని లారీలున్నాయి. అమ్మకంపన్ను చెల్లించకుండా ఆయన ఇనుపగొట్టాలు, తదితర వస్తువులను ఆంధ్రరాష్ట్రానికి దొంగ రవాణా చేస్తూండేవాడట. ఈ లారీల ముందు ఈయన కారులో వెళ్తుంటాడు. ఇదివరకుకూడా కారును ఆపిన ఒక పోలీసును తన కారుతో ఢీకొన్నాడట.

**మా మద్రాసు సినీ ప్రతినిధి**

ఈ వార్త చిత్రపరిశ్రమలో కొంత కలవ్యూహం కలిగించింది. చివరికి సహృదయుడు, సౌమ్యుడు అయిన భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత ఎస్. గోపాల్‌రెడ్డి అరెస్టయినది తానుకాదంటూ పత్రికలలో ప్రకటనలు చేయవలసి వచ్చింది!

### మన ముఖ్యమంత్రి పొరపాటుకు నవ్వులు

ఉగాది పర్వదినాన నంది అవార్డుల బహూకరణోత్సవానికి ముందు....శ్రీరామ శ్రీకృష్ణ దుర్యోధన పాత్రలతో ప్రస్తుతిస్తూ, "స్వాగతం! స్వాగతం!" అంటూ ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుని ప్రాంగణంనుంచి శోభాయమానంగా అలంకరించిన సభావేదికవద్దకుతీసుకొస్తూ బాలలు నృత్యంచేయడంతో, ఠీవిగా ఉచితాసనాన్ని అలంకరించిన ఎన్. టి. రామారావు ఎంతగా ఉప్పొంగిపోయారంటే, ఆతర్వాత లేచి సభను ఉద్దేశిస్తూ గంభీరమైన కంఠంతో "అందరికీ సంక్రాంతి శుభాకాంక్షలు!" అన్నారు. దాంతో అందరూ గొల్లున నవ్వారు, ఇలా నవ్వులతో ప్రారంభమైన ఆసభ గురించి చిత్రపరిశ్రమలో చాలామంది ఇంకా చెప్పుకునిచెప్పుకుని నవ్వుకుంటున్నారు.

### నెల్లూరీయుని చిత్రం "పరిచయం"

ఎన్. కృష్ణారెడ్డి ఉత్తమాభిరుచిగల నిర్మాత. తెలుగుప్రేక్షకులకు ఒకచక్కని చిత్రం అందజేయాలన్న సంకల్పంతో గుల్జార్ హిందీచిత్రం "పరిచయ్" ఆధారంగా శ్రీ కామాక్షిక్రియేషన్స్ పతాకంలో "పరిచయం" చిత్రాన్ని నవరసభరితంగా నిర్మించారు. ఊటీలో షష్ఠంరోజులపాటు

—కొరవ 11వ పేజీలో

## ఆంధ్రా బ్యాంకు - మేనకూరు బ్రాంచి, నాయుడుపేట మండలం

# బంగారు నగలు వేలము

ఈ క్రింద తెలియబరచినవారు మా బ్యాంకులో బంగారు నగలు కుదువ పెంచి విడిపించుకొననందున మేనకూరులోని మా బ్యాంకు ఆవరణలో ఈ క్రింది తేదులలో మధ్యాహ్నం 3 గంటల నుండి బహిరంగవేలం వేయబడును. వేలంలో పాల్గొనదలచినవారు రు. 800 లు ధరావతు చెల్లించి పాటలో పాల్గొనవలయును. వేలం తేదీని ఏదైనోటీసులేకనే వాయిదా వేయుటకు, వేలం ఆపుటకు బ్యాంకు వారికి అధికారము కలదు. వేలంవలన కలుగు కష్ట, నష్టములకు బ్యాంకువారు జవాబుదారికాదు. ఇతర వివరములు బ్యాంకు పని చేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

| క్ర. నెం. | వ్యక్తి పేరు మరియు చిరునామా | నికర తూకం (గ్రాములలో) | జి. ఎల్. నెం. |
|---|---|---|---|
| | **వేలం తేది 4 5.1986** | | |
| 1) | కలపాటి వెంకటసుబ్బయ్య తండ్రి- బక్కయ్య, గ్రద్దగుంట | 6 గ్రా. | 6/34 |
| 2) | మిద్దె చంద్రయ్య, తండ్రి- నెమళ్ళూడి | 6 .. | 6/40 |
| 3) | సాగి రంగయ్య. తండ్రి- చెంగయ్య వడ్డిగుంట కండ్రిగ | 26 .. | 6/51 |
| 4) | యరమాపు నారాయణరెడ్డి తండ్రి- వీరరాఘవరెడ్డి, అత్తివరం | 25 .. | 6/57 |
| 5) | కల్లూరు రంగారెడ్డి. తండ్రి- కృష్ణారెడ్డి, కరబల్లవోలు. | 15 .. | 6/66 |
| 6) | మైలారి పొంగయ్య తండ్రి పెంచలయ్య పునేపల్లి | 13 .. | 6/70 |
| 7) | పోశ గున్నయ్య తండ్రి బలరామయ్య మేనకూరు | 6 .. | 6/78 |
| 8) | చిత్తూరు కృష్ణయ్య తండ్రి వెంకటస్వామి వడ్డిగుంట ఖండ్రిగ | 12 .. | 6/79 |
| 9) | నెలవలి చిన్నయ్య తండ్రి పిచ్చయ్య వజ్రంశెట్టి ఖండ్రిగ | 3 .. | 6/86 |
| 10) | కంగ్ర చినభూషయ్య తండ్రి బక్కయ్య భీమవరం | 10 .. | 6/112 |
| 11) | నలజం నాగరాజు తండ్రి బుచ్చయ్య జోనులవారి ఖండ్రిగ | 19 .. | 6/156 |
| 12) | మల్లాపు రామయ్యశెట్టి తండ్రి- ఆదినారాయణ మనవాలి | 14 .. | 6/170 |
| 13) | ముమ్మాడి వెంకయ్య తండ్రి సుబ్బయ్య కరబల్లవోలు | 15 .. | 6/172 |
| 14) | గుంతమడుగు రాజేంద్రరాజు తండ్రి- వెంకటసుబ్బరాజు కోనేటిరాజుపాళెం | 6 .. | 6/185 |
| 15) | బొడ్డు మస్తానయ్య తండ్రి మీరయ్య పాల్పూరు | 3 .. | 6/255 |
| 16) | వేము సుబ్రహ్మణ్యం తండ్రి నారయ్య వడ్డిగుంట కండ్రిగ | 22 .. | 6/262 |
| 17) | జి. నారదముని తండ్రి మునుస్వామి మేనకూరు | 42 .. | 6/263 |
| 18) | చింతంరెడ్డి వెంకటరెడ్డి తండ్రి పిచ్చిరెడ్డి అత్తివరం | 5 .. | 6/297 |
| 19) | పట్టమనేని చినవెంకటయ్య తండ్రి- యానయ్య, మేనకూరు | 3 .. | 6/301 |
| 20) | కట్టారామయ్య తండ్రి చెంగయ్య గ్రద్దగుంట | 6 .. | 6/320 |
| 21) | కట్టా సుధాకరరెడ్డి తండ్రి రామచంద్రారెడ్డి మేనకూరు | 12 .. | 6/332 |
| 22) | ఇపవాకసిద్ధారెడ్డి తండ్రి సుందరరామిరెడ్డి సిరసనంబేడు | 19 .. | 6/337 |
| 23) | పి. వి. రమణమూర్తి తండ్రి నాగయ్య మేనకూరు | 52 .. | 6/346 |
| | **వేలం తేది 15.5.1986** | | |
| 24) | ముప్పాల జయరామరాజు తండ్రి నారాయణరాజు కోనేటిరాజుపాళెం | 13 .. | 6/373 |
| 25) | ముప్పాల రామరాజు తండ్రి అనంతరాజు కోనేటిరాజుపాళెం | 6 .. | 6/375 |
| 26) | కొలని శ్రీనివాసులు తండ్రి వెంకటరామయ్య నాయుడుపేట | 45 .. | 6/376 |
| 27) | ఓరేపల్లి పోలయ్య తండ్రి నరసయ్య పాలచూరు | 3 .. | 6/378 |
| 28) | చిగురు వెంకయ్య తండ్రి రమణయ్య కారూరు | 26 .. | 6/382 |
| 29) | తూటాకుల సుందరయ్య తండ్రి పోలయ్య మేనకూరు | 24 .. | 6/384 |
| 30) | ఇరుగు చినవీరాస్వామి తండ్రి- వీరాస్వామి పాలచూరు | 14 .. | 6/388 |
| 31) | సాంబి మునెయ్య తండ్రి బక్కయ్య ఎర్రంశెట్టిపాళెం | 15 .. | 6/400 |
| 32) | నగవోలు రాచయ్య తండ్రి వీరాస్వామి ముమ్మాయపాళెం | 11 .. | 6/402 |
| 33) | కాటూరు మునికృష్ణయ్య తండ్రి- మునెయ్య పాలచూరు | 7 .. | 6/403 |
| 34) | ముప్పాల పెంచలరాజు తండ్రి- అయ్యలరాజు కోనేటిరాజుపాళెం | 12 .. | 6/412 |
| 35) | జోలి రాజయ్య తండ్రి నరసయ్య పాలచూరు | 42 .. | 6/416 |
| 36) | ఎద్దుల పేరారెడ్డి తండ్రి వసుంధరారెడ్డి పాలచూరు | 18 .. | 6/439 |
| 37) | అరవభూమి గోపాలరెడ్డి తండ్రి మునిరెడ్డి మనవాలి | 16 .. | 6/443 |
| 38) | తూటాకుల రాజగోపాల్ తండ్రి- బంగారయ్య అత్తివరం | 50 .. | 6/447 |
| 39) | ఎద్దుల రామకృష్ణారెడ్డి తండ్రి వాసుదేవరెడ్డి పాలచూరు | 24 .. | 6/456 |
| 40) | నారిబోయిన హనుమంతయ్య తండ్రి- సుబ్బయ్య ద్వారకాపురం | 17 .. | 6/462 |
| 41) | కట్టా రామయ్య తండ్రి చెంగయ్య గ్రద్దగుంట | 31 .. | 6/463<br>6/465 |
| 42) | పల్లం వెంకయ్య తండ్రి బక్కయ్య మేనకూరు | 6 .. | 6/475 |
| 43) | కవిలి కృష్ణయ్య తండ్రి రామసుబ్బయ్య పాలచూరు | 22 .. | 6/481 |
| 44) | పెనుబర్తి గురుప్రభాకరరావు తండ్రి- బాలకృష్ణమూర్తి మేనకూరు | 25 .. | 6/485 |
| 45) | తిరువలశెట్టి మునుస్వామి తండ్రి-కుప్పిశెట్టి గ్రద్దగుంట | 22 .. | 6/490<br>6/503 |
| 46) | పుట్టు పోలయ్య తండ్రి వీరాస్వామి మేనకూరు | 9 .. | 6/494 |
| 47) | కొప్పుల రామసుబ్బమ్మ భర్త లేటు నారయ్య మేనకూరు | 5 .. | 6/500 |
| 48) | పాలచూరు చెంగయ్య తండ్రి పిచ్చయ్య అత్తివరం | 50 .. | 6/504 |
| 49) | పాకంటి నరసయ్య తండ్రి పెంచలయ్య అత్తివరం | 60 .. | 6/505 |
| 50) | గంగాబత్తిన వీరభద్రయ్య తండ్రి సిద్దయ్య మేనకూరు | 13 .. | 6/510 |
| 51) | కట్టా చలపతి తండ్రి చెంగయ్య గ్రద్దగుంట | 5 .. | 6/511 |
| 52) | సంగీతం రఘురామయ్య తండ్రి రామయ్య మేనకూరు | 19 .. | 6/513 |
| 53) | పేరంశెట్టి రామకృష్ణయ్య తండ్రి- పొట్టయ్య మేనకూరు | 4 .. | 6/516 |
| 54) | మల్లాపు రామయ్యశెట్టి తండ్రి- ఆదినారాయణ మనవాలి | 45 .. | 6/517 |
| 55) | ముమ్మారెడ్డి వెంకటకృష్ణారెడ్డి తండ్రి- వెంకటరామిరెడ్డి భీమవరం | 25 .. | 6/519 |
| 56) | కొట్టు వెంకటసుబ్బయ్య తండ్రి- సుబ్బయ్య మేనకూరు | 6 .. | 6/521 |
| 57) | అంబుసు చంద్రయ్య తండ్రి మునుస్వామి మేనకూరు | 3 .. | 6/528 |
| 58) | అన్నపు కృష్ణయ్య తండ్రి మునుస్వామి నెమళ్ళూడి | 38 .. | 6/535 |

—బ్రాంచి మేనేజర్



గూడూరు సబార్డినేట్ జడ్జి కోర్టులో

E. P. 59 of 1978

O. S. 58 of 1975

ఆంధ్రాబ్యాంక్, గూడూరు
represented by its Branch Manager -D.Hr.

M/s. విజయ మైకా ట్రేడర్స్, గూడూరు
represented by its sole proprietor
ఎస్. హరిరామమూర్తి వగైరాలు
-J.Ds.

ఈ నెంబరు డిక్రీ బాకీని రాబట్టుటకు ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని పై కోర్టువారిచే 10-6-1986 తేదిన పగలు 10 గంటల నుంచి బహిరంగముగా వేలం వేయబడును. పాడదలచినవారు కోర్టుకు హాజరై పాట పెట్టుకొనవచ్చును. — షెడ్యూలు —

నెల్లూరు రి॥ డి॥ గూడూరు సబ్ రిజిస్ట్రేషనులో చేరిన గూడూరు టౌను తూర్పువీధిలో గూడూరు మునిసిపాలిటీ పాత వార్డు నం. 7 కొత్త వార్డు నం. 6 లో డోర్ నం. 250 మరియు 250/1 గల (అసెస్‌మెంటు నం. 2432-ఎ మరియు 2433-ఎ) మిద్దె ఇల్లు ఖాళీ స్థలమునకు హద్దులు :

తూర్పు మునిసిపల్ రోడ్డు; దక్షిణం పి. పద్మావతమ్మ మరియు పల్లటూరు కొండయ్య నాయుడుగార్ల ఇల్లు కొంత వరకు; పడమర నాపూరు రామయ్య నాయుడు ఇల్లు; ఉత్తరం మనుబోలు నారాయణరెడ్డి ఇల్లు ఈ హద్దులలోని 2 భాగములు గల 20 అంకణముల మిద్దె ఇల్లున్నూ 15 అంకణముల ఖాళీ స్థలమున్నూ ఈ ఆస్తిపై 13-6-74 తేది గల రూ. 15,000/- ఆడమానం బాకీకి లోబడి యాలం వేయబడును.

డిహో కిమ్మత్తు రూ. 20,000/-

ఫిర్యాది కిమ్మత్తు రూ 25,000/-

- పి. ప్రభాకరరావు, డి.హో. అడ్వకేటు

## మన పరిశ్రమలు (4 వ పేజీ తరువాయి)

కార్మిక అశాంతిపై విరక్తికలిగినట్లుంది. పరిశ్రమ తవిష్యత్తు, కార్మికుల క్షేమం పంటివేవి పట్టించుకోకుండా, కేవలం తమ స్వార్థమే చూచుకునే నాయకుల చేతిలో కార్మికులు బందీలుగా వుండటం, నెల్లూరు పారిశ్రామికాభివృద్ధికి పెద్ద విఘాతంగావటం, అందరెరిగిందేకదా!

నెల్లూరు కార్మిక నాయకులు నిరుత్సాహ పరచకుండావుంటే, తరలోని అభివృద్ధి అంతా నెల్లూరులోనే జరిగివుండేది. తయనోరా వంటి పరిశ్రమలు కూడా ఇక్కడే స్థాపించివుండేవారేమో. ఆ మేరకు నెల్లూరుకు జరిగిన నష్టం ఊహకందనిది.

కొత్త పరిశ్రమలు పెట్టకపోయినా కొత్తగా పరిశ్రమలు పెట్టాలనుకునేవారికి తన అనుభవాలు పంచిపెట్టడంద్వారా, ఓబులరెడ్డి జిల్లాకు ఎంతో సేవచేసే అవకాశం వుంది. ఏడాదిలో ఒక్కరోజైనా యువపారిశ్రామికవేత్తలకు తనను కలుసుకునే అవకాశంయిచ్చి, వారికి మార్గనిర్దేశంచేస్తే, ఎన్నోకుటుంబాలలో దీపం వెలిగించిన ధన్యజీవిగా కీర్తికెక్కుతారు.

• • •

ఓబులరెడ్డిగారికి ఇద్దరు కుమారులు. వీరిద్దరుకూడా పారిశ్రామికులే. నిప్పో యాజమాన్యం ఒకరు పర్యవేక్షిస్తుంటే, తయనోరా వ్యాపారం ఒకరు చూస్తున్నారు. ఎందువల్లనో వీరిద్దరికి నెల్లూరులో, నెల్లూరీయులతో పరిచయమేలేదు.

-మా ప్రత్యేక విలేఖరి

## చిత్రసమీక్ష (9 వ పేజీ తరువాయి)

కనిపెట్టినట్లుగా భావించినట్లుంది దర్శకుడు, కాలేజిపిల్లలు పిక్నిక్కు పోయినప్పుడు వారితోగూడా లైబ్రేరియన్‌భార్య అయిన ఈ స్థూలకాయం పోవడమేమిటి? అక్కడ డ్యాన్సుచెయ్యటమేమిటి? ఇవంతా హాస్యం చూపేందుకు దర్శకుడు పడ్డ అవకతవక అగచాట్లు.

అనవసరమైన పాత్రలు, ఏ అవసరమూలేని సభిభాషణలు చిత్రంలో చోటు చేసుకున్నాయి.

దర్శకుడు జంధ్యాల రచయితగా తాను వ్రాసిన ఏ సంభాషణలోనూ పసలే పోవటమే ఒక ప్రత్యేకతగా చూపారు. ఒక్కటీ వినతగింది లేకపోవటం పాటల రచనలోని ప్రత్యేకత. కె. వి. మహదేవన్ గూడా తన సంగీతంలో ప్రత్యేకత కనుపరిచారు. అవి- కర్ణకఠోరమైన పాటలు. చెవుల్లో దూది పెట్టుకున్నా చెవులు బ్రద్దలయ్యేంత శబ్దంతో నేపథ్య సంగీతాన్ని కూర్చటం. పంద మూరి మోహన్‌కృష్ణ కెమెరాలోనూ ప్రత్యేకత వుంది, అది బొమ్మ మసగ్గాకనబడదట.

కటవను అభినయించేసిన బాలకృష్ణ.

## సినిమా (9 వ పేజీ తరువాయి)

రాజాపాత్రలో సంభాషణలపుర్వారంలో స్పష్టత కనుపరచకపోవటం యితని ప్రత్యేకత. రజని, లక్ష్మీపాత్రలో అన్ని అంగాల్లోనూ లోతగావుండటం ఆమెప్రత్యేకత. మిగతా నటీనటుల గురించి ప్రత్యేకించి చెప్పుకోతగ్గ అవసరం లేనంత గొప్పగా వుండటం ఆ పాత్రల ప్రాపణలోని ప్రత్యేకత. ★

నాలుగుపాటలు అక్కడి అందమైన జామ్‌నగర్ ప్రిన్సెస్ పేలెస్‌లో ఈచిత్రంలోని పాత్రధారులందరూ పాల్గొనే ముఖ్యమైన సన్నివేశాలను ఎంతోరసవత్తరంగాచిత్రీకరించారు దర్శకులు ఎస్. రామచంద్రరావు.

క్రమశిక్షణపేరుతో మనవడు, మనవరాళ్లను కట్టుదిట్టాలతో, వారి స్వేచ్ఛకు భంగం కలిగిస్తుంటాడు ఓ తాతయ్య. ఆయనపట్ల క్రమక్రమంగా ఆ పిల్లలకు అపోవితమైన ద్వేషంఏర్పడుతుంది. ఒక్లా అల్లరిల్లోలంగావున్న ఆ కుటుంబంలోకి ప్రైవేట్‌మాస్టారుగా పరిచయమైనఓయువకుడు ప్రవేశించి వాళ్ళ జీవితాలకొక కొత్త అర్థాన్ని చెప్తాడు: పిల్లలను నయాన ఒకదారికి తీసుకరాగలమేకాని, భయాన ఏమీ చేయలేమనే విషయాన్ని తాతయ్య గుర్తిస్తాడు ఇలా అడుగడుగునా ఉత్కంఠతో సాగిపోయే ఈ చిత్రంలో భానుచందర్, శరత్‌బాబు, సత్యనారాయణ, కొత్తనటి అమల ఎస్, వరలక్ష్మి, జెనర్ది, వీరభద్రరావు, పొట్టిప్రసాద్, మదన్ మోహన్, బాలతారలు హరి, రాజశేఖర్, సీత, రాజేష్ నటించారు. సమర్పణ: ఎస్. కృష్ణప్రసాద్ రెడ్డి. ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: ఎస్. కృష్ణప్రసాద్‌రెడ్డి. ★

సంపాదకుడు. ముద్రాపకుడు. ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామిరెడ్డి, జమీన్‌రైతు ప్రెస్. 17/170. అబ్బిరాజువారి వీధి. నెల్లూరు-524001